# వీణ

సంపుటి ౧ :: సంచిక ౫

నవంబరు ౧౯౩౬

సంపాదకుడు

పాటిబండ మాధవశర్మ

ఏడాది చందా రు 2 లు : విడి సంచిక అ 4 లు

వీణ కార్యాలయం :: తేలప్రోలు, కృష్ణా

VEENA REGD. NO. M 3554

# విషయసూచిక.



---

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౭౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి 'అధ్వర్య' వరకుతెలుగుగల విషయములు గలవు. త్రివర్ణపటములు ౮, ఇతర పటములు ౧౨౪, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౯౧౦ లకుమించిన పుటలు కలవు. 'అన్' మొదలు 'అశ్విని' వరకుగల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦, ఇతరపటము ౪ ౨౬౦ కి పైగా, వివిధవిషయములు ౪౦౦ వరకు నుండును.

ప్రతిసంపుటమును చక్కని స్వదేశీ చర్మముతోడను, బంగారు రేఖలతోడను సంపుటీకృతము. సంపుటము ౧ కి రూ. ౧౦.

ప్రవేశ రుసుము రూ. ౧.

పోస్టు-రైలు ఖర్చులు ప్రత్యేకము. అడ్వాన్సు రూ.౫ పంపవలెను. మూడవ సంపుటము ముద్రణమున నున్నది.

పండితసాహాయ్యమునను, అపారసాధనసంపదల మూలమునను సాధ్యము గాదగిన ఈ కార్యమును దలపెట్టుట సాహసము, అనాలోచితమును ఐనను ఆంధ్రమహాజనుల సాహాయ్యమున నీ ప్రయత్నము సఫలము గాగలదని నమ్మెదము యథాశక్తి సహాయము చేయుటకు వేడుచున్నాము.

మేనేజరు,
ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము,
నెం 7, తంబుశెట్టివీథి, మదరాసు.

# [illegible]

వ్యవస్థాపకులు, సంపాదకులు

## మాధవశర్మ : రాజగోపాల్

1 నవంబరు 1936



సంపుటి ౧ : : సంచిక ౫

ఏడాది చందా : రెండు రూపాయలు

విడి సంచిక — పావలా

వీణ, తెనాలి

# విరాళములు

కేవలం రెండు రూపాయల చందాలతో వీణను నిర్వహించడం సాధ్యం కాదని వీణ ఆకృతీ, అలంకృతీ గమనించిన సహృదయులకు విదితమవుతుంది. సామాన్యపాఠకుని ఉద్దేశించి తక్కువ చందా ఉంచినా ఉత్సాహం కల అభిమానులు యథాశక్తి విరాళాలు ఇప్పించి సాయపడితే తప్ప వీణను ఈ రూపంతో నిర్వహించడం కుదరదు. ఇది గ్రహించిన మిత్రులు యథోచితంగా వీణను సత్కరిస్తున్నారు. వారికి కృతజ్ఞత తెలుపుతున్నాము. సం. వీణ

శ్రీ మండలపర్తి ఉపేంద్ర శర్మగారు, బి.ఏ. (ఆనర్సు)
హిందూ కాలేజి, గుంటూరు ... రు. 5

శ్రీ పి. ఆర్. పి. ఫ్రాన్సిస్‌గారు, బి.ఏ. (ఆనర్సు)
క్రిస్టియన్ కాలేజి, గుంటూరు ... రు. 5

శ్రీ మారేమండ రామారావుగారు, యం.ఏ., బి.ఇడి.
హిందూ కాలేజి, గుంటూరు ... రు. 5

శ్రీ ఉన్నవ బాలసుందరరావుగారు, బి.యస్‌సి. (ఆనర్సు)
హిందూ కాలేజి, గుంటూరు ... రు. 3





సంపుటి ౧ * శా.శ ౧౮౫౮ ధాత, ఆశ్వయుజము * సంచిక ౫

## వీణ విషయం

*

వీణ అయిదో సంచిక. ఆరు సంచికలతో ఒకటో సంపుటి పూర్తి చేసి రెండో సంపుటినుంచీ పత్రిక సైజు పెద్దది చేసి యెక్కువ విషయాలు పాఠకులకు అందచెయ్యాలని అనుకుంటూ వున్నాము. కొందరు మిత్రులు ఈ సైజే ముచ్చటగా వుంది వుంచ మంటున్నారు. ఎల్లాగైనా ఇంకా యెక్కువ మేటరు పట్టే ఏర్పాటు చెయ్యడం అవసరంగా వుండడంచేత రెండో సంపుటి నుంచీ వీణ కొంత మార్పు పొందబోతూవుంది. ఇంకా యోచన చేసి వివరాలు ముందు సంచికలో మనవిచేసుకుంటాము.

అస్తమయము

* హిందీని యావద్భారత సాహిత్యానికి పట్టపు రాణిగా చేయాలనుకుంటే యీరోజుల్లో ప్రేమచంద్రుని అస్తమయము చేత ఆసేతు శీతనగము అంధకారములా విషాదము ఆవరించింది. ఈయన అసలుపేరు ధనపతిరాయ్. ప్రేమపంచమి, ప్రేమద్వాదశి, ప్రేమపూర్ణిమ, ప్రేమాశ్రమము మొదలగు రచనలచే సాహిత్యలోకంలో ప్రేమచంద్రుడుగా వెలుగొందినాడు. హిందీని అభ్యసించే ఆంధ్రులకు ప్రేమచంద్రుని ప్రతిభ యిప్పుడిప్పుడే తెలుస్తోంది. బంగాళీసాహిత్యానికి రవీంద్రునివలెనే హిందీసాహిత్యానికి ప్రేమచంద్రుడు మణివంటివాడు. విమర్శకులు ప్రేమచంద్రుని ప్రతిభనుగ్గడిస్తూ, అవకాశములు లేకుండుటవల్లను బీదరికంవల్లను ప్రేమచంద్రుడు రవీంద్రుని మించజాలక పోయినాడని చెప్పుతున్నారు. ఈయన హంస అనే పత్రికను నడుపుతూ ఉండేవాడు. నాలుగు సంవత్సరాల క్రిందట జాగరణ్ అనే వారపత్రికను కూడా చేపట్టారు. వీరి సతీమణి కూడా వీరికి చేదోడుగా పనిచేసి కొన్ని కథానికలను నవలలను రచించినది. అట్టివీరు అకస్మాత్తుగా చనిపోవుట భారతసాహిత్యానికి తీరనిలోటు.

* * *

ఆంధ్రనాటకపితామహ సార్థకబిరుదాంకితుడు హరి ప్రసాదరావుగారు మరణించారు. ఆంధ్రనాటకరంగస్థలాన ఈ లోటు ఎన్నటికీన్నీ తీరనిదని తజ్ఞులు పలుకుకొంటున్నారు. పద్యం చదవడంలోనేమి, భావం వెలిబుచ్చడంలోనేమి, భంగిమను మెరిపించడంలోనేమి సర్వథా ప్రసాదరావుగారి ప్రతిభ అంత విలక్షణమూ, సంపన్నమూ ఐనదట. శృంగార వీర కరుణములను ఒప్పించడంలో ఆయన ప్రత్యేకతనూ, కవి వాక్యానికి వ్యాఖ్యానం చెయ్యడంలో ఆయన ప్రజ్ఞనూ లోకం కొనియాడుతోంది. అపారమైన ఆయన కళాకృషినీ కళామయమైన ఆయన మూర్తిని ఆంధ్రులు శాశ్వతంగా భద్రపరచుకోలేకపోయినా కళాసేవలో ఆయన అఖండత్యాగాన్నయినా స్మరించాలి.

# విరహిణి

వ్యథలన్నిటి నోపికతో
కూరిచితిని పాటలలో—
పాడగ నా వశమగునా?

ఏరోజున కారోజే—
ఉదయమునే— లలితముగా—
పరులెరుగని నాలిపిలో
సుమదళముల రచియింతును.

సాయంతనమున మళ్ళీ—
పదపడి నే చెరిపేతును.

వికసించుట నాకొరకే—
రాలిపడుట నాకొరకే—
చక్కని రంగుల పూవులు—

గిరిశిఖరిని వెనురుపొదలు
నిశిపాడిన గీతులలో—
మిణుగురులటు నాగీతులు
కొలదిగ—మరి—వినబడినవి.

నాలో నే తెలబోవుచు
ఎంతనియో—సిగ్గిలితిని—
ఏమరినే వ్రాసెడి తరి—
ఏమూలలను దాగొనెనో?
అటునిటు మసలెడి పవనుడు—
ఎంతనియో— సిగ్గిలితిని —

"యెలమావి"

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

# చిట్టి చెల్లాయికి

ఏ నతులహర్షవిస్ఫారితేక్షణముల
నీ తరళమూర్తి సన్నిధి నిలుచునంతి
కోటిసాగర గంభీర ఘోషణముల
అరచునెదో! జన్మజన్మాంతరానుభూతి:

అతిమహోన్నత హిమవన్నగాగ్ర శిఖర
మకుటమాణిక్యదివ్యతారకవు నీవు!
ఇమ్మహావిశ్వ శుక్తిగర్భమ్మునండి
చిన్నిముత్తెమ్ము నిన్నుసృజించుకొనియె!

మంచు టోసుక యెడారులనుండి రేగి,
ధూళి దిగదన్నుకొను సుడిగాలినేను:
అగపడని తారకాకాంతి నరయగోరి,
ఎగయుదును చెల్లి! నా కరయుగళి నెత్తి:

పిలకా గణపతిశాస్త్రి

# ఆంధ్ర భారత రచనోద్దేశ్యము

గొడవర్తి సూర్యనారాయణరావు, ఎం.ఏ. (ఆనర్సు)

గాసటబీసటే చదివి గాథలు త్రవ్వి తెనుంగువారి నోములపంటగా పదునొకండవ శతాబ్దమున ఆంధ్రమహాభారతము వెలువడినది. భారత గంగాలహరిని ఆంధ్రక్షేత్రములఁ బ్రవహింపఁజేసి పునీతముగావించిన మహాత్ముఁడు విద్యాదయితుడు నన్నయభట్టారకుడు. ఈ మహాకార్యమునకు చేయూతనిచ్చి ప్రోత్సహించినవాడు వేంగీదేశాధీశుడును కావ్యగీతి ప్రియుఁడు నగు రాజరాజనరేంద్రుఁడు.

ఈ పంచమవేదమును ఆంధ్రమున రచించుటలో గల యుద్దేశ్యమునుగూర్చి ప్రజలలో భిన్నాభిప్రాయములు ప్రబలినవి. వేదమతపునరుద్ధరణము ప్రధానకారణము అని ఒకపక్షమువారి వాదన. భాషాప్రయోజనమునకేగాని మతమునకు కాను అని ద్వితీయ పక్షావలంబులగు శ్రీయుత పింగళి లక్ష్మీకాంతంగారు మొదలైన వారి వాదన. శ్రీ రామలింగారెడ్డిగారు "భారత గ్రంథరచనము యొక్క యుద్దేశ్యము బ్రాహ్మణ మతోద్ధరణము. భాషనే పరమార్థముగా భావించి సేవించు చిత్తప్రవృత్తి ఆ కాలమున లేదు. ఉండినచో మతగ్రంథములుతప్ప ఇతరములేల వ్రాయబడకపోయినవి" అని తమ అధ్యక్షవచనములో పల్కి యున్నారు. శ్రీభావరాజు కృష్ణారావుగారు కూడ దీనినే యుపపాదించిరి. వీరు చూపు ఉపపత్తులెవ్వియనగా బౌద్ధజైనాదిమతముల వ్యాప్తిచేతను, వేదతిరస్కార భూయిష్ఠములైన కౌత్స చార్వాకాది వాదములచేతను హిందూమతముయొక్క ప్రాణములనదగిన వర్ణధర్మము కష్టస్థితికి వచ్చినవి. రాజరాజునుగూర్చి భారతమున "వివిధాగమ విహితశ్రముఁడు" "సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిముఁడు" "విప్రకులము నెల్ల బ్రోచుచు అగ్రజన్ములకు అనుగ్రహమున మహాగ్రహారములిచ్చువాడు" అని యుండుటచే నాతడు వర్ణ ధర్మ పునరుజ్జీవన బద్ధకంకణుడని

తెలియుచున్నది. కావున పంచమ వేదమగు భారతమును మాతృ భాషలోని కనువదించి వేద మతమును పునరుద్ధరింప నెంచెనని తెలియుచున్నది. ఇదిగాక బౌద్ధులు జైనులు మొదలగు వేదనిరాకరణ వాదులు జనులను తమ మతములో జేర్చుకొనుటకై మాతృ భాషలో గ్రంథములు వ్రాసి యుందురు. ఆంధ్రులలో ననేకులు బ్రాహ్మణ మతమును విసర్జించి జైన మతమును స్వీకరించి యుండుట సుస్పష్టము. వర్ణాశ్రమపరాయణులును తమ వైరులు ప్రయోగించిన దేశభాషా ప్రకటనాస్త్రమే తామును ప్రయోగింప వలసిన వారైరి. ఇదియ తొలుదొల్త పంచమ వేదమును స్పృశించుటకు హేతువు.

పైసిద్ధాంతము నీక్రింది విధముగా పూర్వపక్షము చేయవచ్చును. ఆ నాటికి అనగా పదియవ శతాబ్దాంతము మొదలు పదునొకండవ శతాబ్దమువరకును మతముల స్థితి యెట్లుండెనో తొలుత విచారింప వలసియున్నది. సర్వసిద్ధియను బిరుదాంకితుడగు జయసింహ వల్లభుడు ఏడవ శతాబ్దమున చాళుక్య రాజ్యమును పరిపాలించిన ధీయుతుడు. ఇతడు బ్రాహ్మణ మతావలంబకుడు. ఈతని కాలమున చీనాదేశయాత్రికుడగు యువాన్ చ్వాంగ్ దక్షిణ హిందూస్థానములోని సుప్రసిద్ధ బౌద్ధమతమునకు పట్టుగొమ్మయైన అమరావతీ ధాన్యకటకము మొదలగు క్షేత్రములను సందర్శించి వ్రాయుచు బౌద్ధమతము క్షీణదశయందుండుటకును, బౌద్ధుల సంఘారామములు శిథిలములై యుండుటకును అయ్యవి చాలవఱకు భిక్షుకశూన్యము లగుటకును మిక్కిలి వగచెను. దీనినిబట్టి ఆనాటికి బౌద్ధమతమెట్టి స్థితిలో నున్నదియు తెలియు చున్నది. ఆంధ్రరాజుల కాలమునాడు ఉచ్ఛదశ యందుండిన బౌద్ధమతము తరువాతి కాలమున అనగా క్రీస్తుశకము ఒకటిరెండు శతాబ్దములనాటికే యాంధ్రదేశమున రాణదక్కి యుండెను. శాతకర్ణులు, పల్లవరాజులు గూడ బ్రాహ్మణమతము నుద్ధరించిరి. కావున బ్రాహ్మణ మతము వర్ణాశ్రమ ధర్మములు మున్నుగనవి ప్రబల నారంభించెను. కాని ఒకత్రోవ బౌద్ధ జైన మతములు విజృంభించుచునే

యుండెను. సుప్రసిద్ధ తత్త్వజ్ఞానియైన నాగార్జునభట్టు, తార్కికుడగు దిఙ్నాగాచార్యుడు ఆంధ్రులై యుండియు బౌద్ధమతమును పోషించిరి. ఆధ్యాత్మిక భౌతికజ్ఞాన మంతయు జైనాచార్యుల చేతిలో నుండెను. అట్టి సమయమున బ్రాహ్మణ మతము నుద్ధరింప సమకట్టి యవతరించిన మహాపురుషుడు కుమారిల భట్టాచార్యుడు. ఈతడు వేద తిరస్కారులగు జైన బౌద్ధుల వాదములను ఖండించి కర్మమార్గ ప్రధానమైన వైదిక ధర్మమును వర్ధిల్ల జేసెను. ఈ కుమారిల భట్టు ఎనిమిదవ శతాబ్దము వాడు. ఈతని వెనువెంట నవతరించి వేదాంత మార్గ ప్రధానమైన వైదిక ధర్మము నుజ్జీవింప జేసిన వాడు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు. ఈ యవతార పురుషులచే స్థిర రూపమును బొందిన వైదిక మతమును ప్రతిఘటింప జాలక బౌద్ధ జైన మతములు దైన్యస్థితిలో నుండి తుదకు కాకతీయుల కాలమున నామ రూపముల కోల్పోయినవి. ఈవిషయమంతయు శ్రీ భావరాజు కృష్ణరావు గారు తమ పూర్వ చాళుక్యుల చరిత్రములో వివరించిరి. కావున భారతాంధ్రీకరణ సమయమునకు బూర్వము తీవ్రముగా నున్న మత కలహము లంతమొందినవి. విరివిగా వ్యాప్తిలో నున్న జైన బౌద్ధ మతములని పేరొందిన నాస్తిక మతములు జీర్ణములైనవి. ఒకవేళ నెచ్చటనైన నున్నను బహుళ ప్రచారములో నున్న వేదమతమును ప్రతిఘటింప జాలినంత శక్తి లేక దౌర్బల్య స్థితిలో నుండెను.

ఇక రాజరాజు వేదమత పునరుద్ధరణ బద్ధకంకణుడు గావున భారత రచనకు బురికొల్పె ననునది విచారింప వలెను. ఒక్క రాజరాజే వేద మతావలంబి కాడు. ఇంచు మించుగా చాళుక్యులందరును వేదమతావలంబులే. శ్రోత్రియులే. ఈతడొక్కడే బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చి పోషించిన వర్ణాశ్రమ ధర్మరక్షణ మహా మహిముడు కాడు. ఇట్టివారు చాళుక్య నృపతు లెందరో దివంగతులైరి. ఏడవ శతాబ్దము వాడగు జయసింహ వల్లభుడు (సర్వసిద్ధి)అను చాళుక్యరాజు బ్రాహ్మణ మతావలంబకుడు. 779—836 వఱకు రాజ్యపాలన చేసి విజయ

చిహ్నములుగా నూటయెనిమిది శివాలయములను ప్రతిష్ఠించిన రెండవ విజయాదిత్యుడు బ్రాహ్మణమతావలంబకుడె. తొమ్మిదవ శతాబ్దాంతము నను పదియవ శతాబ్దపు ప్రారంభము నను రాజ్యముజేసిన చాళుక్యభీముడు తన పేర చాళుక్యభీమ పురమును నిర్మించి భీమేశ్వర స్వామిని ప్రతిష్ఠించెను. ఈతడే ద్రాక్షారామమున భీమేశుని గూడ ప్రతిష్ఠించెను. ఇతడును బ్రాహ్మణమతోద్ధారకుడే. రాజరాజనరేంద్రునికి గూడ పార్వతీ పతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవ మన్న ఆసక్తి మెండు. ఈ రాజులందరు శైవ మతావలంబకులయ్యును బ్రాహ్మణ మతము నుద్ధరించు వారే గాని దానిని ఛిన్నభిన్నము చేయు వీరశైవులు కారు. కావున రాజరాజును తన వంశీయులకు తదితర నృపతుల వలెనే బ్రాహ్మణ మతోద్ధారకుడు. సప్తసంతానములలో ప్రశస్తిగాంచి ఖిలము గాకుండునది కృతియగుటచే భారతము నందు రాజరాజిట్లు కీర్తితో ఆచంద్రార్కముగ వెలుగుచున్నాడు తదితరులు కావ్యకన్యను స్వీకరించియుండమి స్మృతి పథము నుండి మఱుగుపడిరి. కావున రాజరాజునకున్న విశేషముల బట్టి ఆతడు వర్ణాశ్రమ ధర్మ నిర్వహణమునకై భారతమును రచింపించె ననుటలో విశేషములేదు. పైవిషయములను చూడగా తదితరుల కాలములో అనగా బౌద్ధమత విజృంభణములో గాక నేడు రాజరాజు కాలములో వేదమత పునరుద్ధరణకు అవశ్యకత కన్పట్టదు. మీదుమిక్కిలి రాజరాజున కున్న విశేషములు దానికి కారణములు కావు.

జైనబౌద్ధ గ్రంథములకు ప్రతిఘటనగా మతప్రచారమునకై భారతము రచింప బడెను అను విషయమును విచారింతము. రాజరాజు కాలమునాటికి వేదమతము దేశమం దంతటను వ్యాపించి యుండుటచే ప్రత్యేకప్రచారమునకవసరము లేదు. అదిగాక మతప్రచారముచేయ వలసినది పామరలోకమునకుగాని పండితలోకమునకుకాదు. ఇక పామరలోక ప్రచారార్థము భారతము వంటి సంస్కృత పదభూయిష్ఠమైన పండిత బోధకమైన గ్రంథము నిరుపయోగము. పామరులలో

ప్రబోధము కలిగింపవలయునన్న గీతవులు, గేయములు, పదములు వీనిద్వారా చేయనగును. తెనుగు భారతమును పురాణముగా జదివి ప్రబోధించ గూడదా యను సందియము కలుగవచ్చును. కాని పురాణపఠనమునకు సంస్కృతభారతమే చాలును. కావున పామర లోకమున మత ప్రచారమునకై ఆంధ్రభారత మనవసరము. ఇక శిష్టులకన్ననో వారు సంస్కృత భారతమునే పఠించి యానందింప గలరు. కావున భారతరచన భాషా ప్రయోజనమునకుగాని మత ప్రచారార్థము కాదని తెలియుచున్నది.

( సశేషం )

# సాగరతీరాన

ఏల రేలుపవలు విలపింతు వింత
జాలి జాలిగా సాగరస్వామి? నీ వి
లాపగీతికావిసరవిరావ మీవి
భావరీవేళ నాహృది నావరించె!

అస్మదీయదీనమృదుహృదంతరాళ
దుఃఖభారావహ మొకింత తొలగిపోవ,
ఏడ్చివైతు ఎలుంగెత్తి ఏడ్చివైతు
శోకగీతులు నీలోనె సుడివడంగ!

కరగు కాటుక కరుడుల కారుకొనిన
కటిక చీకటి శోకలోకాన నాకు,
ఈ యనంతమగు నితాంతమాయజగతి
అప్పుడవు నీవొకండవె ఆర్తమూర్తి!

"మణిమాల"

దామెర రాజగోపాలరావు

# సైమూన్

## సహదేవ సూర్యప్రకాశరావు

(స్ట్రిండ్‌బెర్గు రచననుండి అనూదితము)

పాత్రలు బిస్క్రా: అరబ్బీయుల పడుచు.
యూసెఫ్: ఆమె ప్రియుడు.
గైమార్డు: లెఫ్టినెంట్

ప్రదేశము — ఆల్జీరియా. [అరబ్బీవారి శ్మశానవాటి. ప్రార్థించుకోవడానికి చిటిచాపలు అక్కడక్కడ ఉన్నవి. కుడిప్రక్క అస్థికలనుంచు మందిరము. దానివెనుక భాగాన్ని ద్వారము. ముందు వసారా. యవనికలు. వెనుక గోడకు గవాక్షరంధ్రాలు. అక్కడక్కడ ఇసుకతిన్నెలు. ఊడబెరికిన కలబంద. ఒక్క తాటిచెట్టు. రెల్లుగడ్డి.]

ప్రథమ రంగము.

[ప్రవేశము: బిస్క్రా]. మొగం ఆమూలంగా మూసికొని పోయే ముసుగు. గితార్ వెనుక వ్రేలుతూ ఉంటుంది. ఉద్వేలంతో ఒక చాప మీద మోకరించి సిలువలా వక్షస్సుమీద హస్తాలుంచుకొని ప్రార్థిస్తూ ఉంటుంది. బయట ప్రభంజనము వీస్తూ ఉంటుంది.]

బిస్క్రా

ఇయా ఇలాహా అల్ అల్లా!

యూసెఫ్

(తొందరగావచ్చి) *సైమూన్ రేగుతోంది. ఏడీ ఫ్రేంక్?‡

బిస్క్రా

త్వరలో ఇక్కడకు వస్తాడు.

యూసెఫ్

తక్షణము అతన్ని పరిమార్చావు కావే?

బిస్క్రా

ఎందుకూ తనంతటతానే హతమారుతాడు. అతన్ని నేనే పరిమారిస్తే

---

* సహారా ఎడారిలో విజృంభించే భయంకరమయిన వడగాడ్పు. అదంటే యూరప్ వాసులకు సింహస్వప్నం.

‡అరబ్బీయులు యూరప్‌వాసులను అలావ్యవహరిస్తారు.

తెల్లవాళ్ళు మన జాతిని మారణహోమం చేస్తారు. నేను ఆలీకి మార్గ దర్శకురాలి ననే కాని, బిస్క్రా కన్యనని వారికి లవలేశం తెలియదు.

యూసెఫ్

తనంతట తానే! ఎలా?

బిస్క్రా

సైమూన్ తెలియదూ? అది తెల్లవాళ్ళ మేధస్సుని ఖర్జూరపు గింజల్లా ఉద్ఘాటనచేసి, జీవితం అంటే అసహ్యాం, విరక్తి కలిగించేటంత చీకాకు పరుస్తుంది. అది వస్తుందంటే భీతావహులై వారు తెలియకాని ఏసీములకో చెల్లాచెదరౌతారు.

యూసెఫ్

అలాంటి వింత విషయాలు విన్నాను. ఇదివరకు జరిగిన దొమ్మీల్లో ఫ్రేంకులు వారిలో వారే పొడుచుకొని విగత జీవులయ్యారు. మంచు పర్వతాహముకృళము, సాంద్రంగా కలిసింది. అరగడియలో భరతవాక్యం చెప్పాలి. బిస్క్రా! నీవు ద్వేషించవూ?

బిస్క్రా

'ద్వేషించవూ' అంటావా? ద్వేషం. నా ద్వేషానికి ఆవలిసీమ లేను. ప్రచండ మార్తాండునిలా ప్రజ్వరిల్లుతున్నది. నా హృదయ నాళాల్లో ప్రవహిల్లే పవిత్ర ప్రణయం కంటె బలవత్తరంగా ఉంది. అబ్బా! ఆలీని హతం చేసి నాలో ప్రతి క్షణం ఉన్మేషమయ్యే ఆనందాన్ని దోచుకున్నారు. స్వయంగా కోడెత్రాచు దంష్ట్రికలనుంచి కాల కాకోలం సేకరించుకొన్నారు. ఈ సైమూన్ ప్రతిక్రియ చేయలేక పోతే, నేనే చేస్తా ప్రతీకారం.

యూసెఫ్

బాగా అన్నావు. చెప్పినట్లే చేయి నిన్ను కన్నారచూచిన నాటినుండి. నాలోని విద్వేషం శిశిరంలోని తృణాంకురాల్లా మాసిపోయింది. నాలోని యావద్బలం కైవసం చేసికొని నా ధనస్సుకి నారాచం కా.

బిస్క్రా

కౌగలించుకో. యూసెఫ్ కౌగలించుకో.

యూసెఫ్

ఇక్కడ — కాదు. ఇది పుణ్యక్షేత్రం. ఇప్పుడు కాదు నీ యుపహారాన్ని నీవు గడించుకున్న తరువాత—

బిస్రాక్

గంభీరుడా!

యూసెఫ్

ఆ! నా వంశాంకురాన్ని భరించే మహాద్భాగ్యం నోచుకున్నా కన్య తన గౌరవార్హతను ప్రతిష్ఠించుకోవాలి

బిస్రాక్

నేను—ఇంకెవరు—యూసెఫ్ వంశతిలకాన్ని నేనుకాక ఇంకెవ్వరు నవమాసాలుమోస్తారు. నేను బిస్రాక్‌ని—నిర్వాసితను—దూర దుష్టవతిని కాన్ని, కాని బలీయసును.

యూసెఫ్

తథాస్తు. నేనుపోయి ఆసెలయూట వద్ద విశ్రమిస్తాను. షేక్ సిద్దీ వద్ద నేర్చిన రహస్య తంత్రాలు చిన్ననాటినుంచి విఫణి వీధుల్లో ఆచరిస్తూనే ఉన్నావుకదూ! వాని పునరావృత్తికి నే నవసరమా.

బిస్రాక్

అక్కరలేదు. ఈ పిరికి ఫ్రేంకుకు జీవాలు మూరగానే రహస్యాస్త్రాలన్నీ నా హస్తగతాలే. ఆ భీరులు శత్రువుల ముందు ప్రాకులాడుతూ సీసపు రవ్వలు వదులుతారు. నాకన్నీ తెలుసు. నా తంత్రాలు ప్రతీకారం చెయ్యలేకపోతే సూర్యభగవానుడే చేస్తాడు. సూర్యభగవానుడు మనపట్ల ఉన్నాడుగదూ

యూసెఫ్

ముసల్మానుల కాప్త బాంధవుడు సూర్యభగవానుడు. కాని ఇవ్వేళ తీక్షణంగా ఉన్నాడు. నీ గొంతుక ఆర్చుకొని పోతుంది. కొంచెం దాహం పుచ్చుకో. నీ చేతులు వసివాడినట్లున్నాయి. (వంగి జలపాత్రికను తీసి బిస్రాక్‌కు అందించుతాడు.)

బిస్రాక్

(పాత్రను పెదవిదగ్గరకు తీసుకొని) నాకేదో ఎఱ్ఱగా కనిపిస్తున్నది. నా గుండెలార్చుకొని పోతున్నవి అలా చూడు. ఇసుక కుటీర శిఖరాలు దాటి ఎగసిపోతున్నది. గితారు తనంతటతానే మ్రోగుతున్నది. వడగాడ్పు విజృంభిస్తున్నది. కాని— ఫ్రేంక్ ఏడీ.

యూసెఫ్

బిస్రాక్! ఇలా రా! ఫ్రేంకుని తనంతటతానే హతమార్చి: పోనీ. పోనీ.

బిస్రాక్

ముంగు కటికి నరకం — తనవాత భీషణమృత్యువు. నేను వెనుకంజ వేస్తానని భావిస్తున్నావా? (త్రాగబోయిన నీటిని ఇసుకరాశి మీద

పోసి) నా ప్రతీకారం మోసులెత్తడానికి ఇసుకకు నీరు పెట్టుతున్నాను. నా హృదయాన్ని అర్పుకొంటాను. ద్వేషమా! మొలకెత్తు. సూర్యభగవానుడా భగ భగ మండు. ప్రభంజనమా రేగు.

యూసెఫ్

యూసెఫ్ ప్రణయ చిహ్నాన్ని ధరించ బోయే బిస్కా నీకు జయమగు గాక!

(గాలి హోరున వీస్తుంది. ద్వారము వ వ్రేలుతున్న యవనిక రెప రెపలాడుతుంది. అరుణ కాంతితో ప్రజ్వలిత మయిన గది పసిమి నిగ్గులు దేరుతుంది.)

బిస్కా

ప్రేంకు వస్తున్నాడు. అదిగో సైమూను. నీవు వెళ్లి రా.

యూసెఫ్

నన్నొక అరగడియలో కలుసుకో. ఇదిగో ఇసుకనేను (ఇసుక తిన్నె చూపుతాడు) ఆ మత విద్రోహియనుయాతనానుభూతిని స్వర్గధామమే గుర్తిస్తుంది.

తెర.

———o———

ద్వితీయరంగము

[ ప్రవేశము: బిస్కా. గైమార్డు. గైమార్డు పాలిపోయి ఉన్నాడు. తూగాడుతున్నాడు. కలత జెంది ఉన్నాడు. హీనస్వరముతో పలుకాడుతాడు.]

గైమార్డు

అదిగో సైమూన్. నా పరివారం ఏదిశగా వెళ్ళిందనిభావిస్తావు.

బిస్కా

ఆగ్నేయ దిశగా — నేనే మార్గం చూపించాను.

గైమార్డు

ఆగ్నేయ దిశగా — నన్ను చూడనీయి. ఆ — ఆ — నన్ను కుర్చీలో కూర్చోపెట్టు. కొంచెం దాహమియ్యి.

బిస్కా

(గైమార్డుని ఇసుకతిన్నె దగ్గరకు తీసుకొనిపోయి క్రింద కూర్చోపెట్టి తలని ఇసుకతిన్నెకు ఆనిస్తుంది) సుఖంగా ఉందా?

గైమార్డు

(ఆమె కేసిచూచి) అంతసుఖంగా లేదు. ఏదయినా తలక్రింద ఉంచు.

బిస్కా

(తలక్రింద ఇసుకప్రోగుచేసి) ఇప్పుడు నీ శిరస్సుక్రింద మెత్తని తలాడ.

గ్రైమార్డు

శిరస్సుక్రిందా—అవినాపాదాలు. నాపాదాలుకావూ.

బిస్కా

అవును. నిజమే.

గ్రైమార్డు

అలాగే అనుకున్నా. తలక్రింద పీట ఉంచు.

బిస్కా

(కలబంద మట్ట తీసి అతని మోకాలిక్రిందఉంచి) చక్కనిపీట, ఇదిగో.

గ్రైమార్డు

దాహము. దాహము.

బిస్కా

( రిక్తపాత్రతీసి ఇసుకతో నింపి గ్రైమార్డుకి అందిస్తుంది. ) త్రాగు. చల్లగా ఉండగానే త్రాగు.

గ్రైమార్డు

( ఇసుకపాత్ర చప్పరించి) చల్లగా ఉంది. అయినా నాపిపాసని ఏమాత్రం ఆర్పటంలేదు — నేను త్రాగ లేను. నీళ్ళంటే అసహ్యం వేస్తున్నది. తీసివేయి. నాదగ్గర నుండి తీసి వేయి.

బిస్కా

నిన్ను ఏదో కుక్క కరిచింది.

గ్రైమార్డు

ఏ కుక్క? నన్నేకుక్క కరవలేదే!

బిస్కా

సైమూన్ నీ స్మృతిని ఛిన్నాభిన్నం చేసి వేసింది. వడగాడ్పు భూత పిశాచాలు ప్రత్యక్ష మవుతవి. జాగ్రత! బేబిల్, ఔడులో నీవు వేటాడు తుండగా నిన్ను వెఱ్ఱి కుక్క కఱవలే? నీకు జ్ఞాపకములేదూ?

గ్రైమార్డు

నిజమే. బేబిల్ ఔడులో వేటాడా! గోధుమవన్నె శునకం కదూ.

బిస్కా

ఆ. ఆడకుక్క. ఇలా చూడు. నిన్ను పిక్కమీాద కరచింది. ఆ గాయం నిన్ను బాధించడంలే?

గ్రైమార్డు

( పిక్కతడివి చూచుకుంటాడు. కలబంద గీసికుంటుంది. ) అవును బాధగా ఉంది. దాహము. దాహము.

బిస్కా

(ఇసుకపాత్ర సందించి ) త్రాగు.

తాగ్రు.

గ్రైమార్డ్

వద్దు. త్రాగలేను. అయ్యో! దైవమా! నా మనస్సు విహ్వాలంగా ఉంది.

బ్రిస్కా

భీతిల్లకు. నా గాన మాధుర్యంతో ఆ భూత పిశాచాల్ని తరిమి వేస్తా.

గ్రైమార్డ్

( కేక వేసి )ఆ —,— ఆ — వద్దు. సంగీతం వద్దు. నేను వినలేను. భరించ లేను. అది నాకేమి ప్రయోజన కారి అవ్వతుంది.

బ్రిస్కా

కాలసర్పంలోని విషశక్తిని, గానం చల్లబరుస్తుంది. అది కుక్కకాటుతో సమానంకాదని భావిస్తున్నావా? (గితారుతో పాడును)బిస్కా! బిస్కా! సైమూన్! సైమూన్!

యూసెఫ్

(భూగర్భం లోనుంచి) సైమూన్! సైమూన్!

గ్రైమార్డ్

అబ్బా! నీవు పాడేదేమిటి?

బ్రిస్కా

నేను పాడుతున్నానా! ఇలాచూడు నానోటిలో తాటాకు పెట్టుకుంటాను. (తాటాకుతీసి పళ్ళమధ్య పెట్టి పాడుతుంది.) బిస్కా! బ్రిస్కా!

యూసెఫ్

(భూగర్భంలోనుంచి) సైమూన్! సైమూన్!

గ్రైమార్డ్

ఏమిటీ దిగ్భ్రాంతి. యమయాతనగా ఉంది.

బ్రిస్కా

నేను గానంచేస్తున్నా, (బ్రిస్కా యూసెఫ్‌లు కలసి) బ్రిస్కా! బ్రిస్కా! బ్రిస్కా! బ్రిస్కా! సైమూన్! సైమూన్!

గ్రైమార్డ్

భూతానివా? పిశాచానివా? ఏం దుస్స్వరములతో గానం చేస్తున్నావు? పురుషమూర్తివా? స్త్రీమూర్తివా? కాక అర్ధనారీశ్వరుడవా?

బ్రిస్కా

నేనా? నేను మార్గదర్శకురాలను అలీని. నీహృదయం విహ్వాలించడం చేత నన్ను గుర్తించ లేకుండా ఉన్నావు. నీ వ్యస్మృత్త భావాల్ని ఉన్మత్త చిత్తవృత్తి నశింపజేసి కొని సుఖింప వలెనంటే నామాట వి

శ్వసించు. నేను ఆజ్ఞాపించినట్లు చేయి.

గైమార్డు

నీవు వేఱే నన్ను ఆజ్ఞాపింప నవసరము లేదు — అంతా అలాగే ఉంది.

బిస్కా

విగ్రహారాధకుడా! నీకా విషయం ఇప్పటికి గ్రాహ్యమయిందా?

గైమార్డు

విగ్రహారాధకుడా?

బిస్కా

ఆ! నీ వక్షంమీద అలంకరించుకున్న ఆ విగ్రహాన్ని తీసివేయి. (గైమార్డు ఒక పతకం తీస్తాడు) క్రిందకు విసరి కాలితో మట్టివేయి. భగవంతుడు ఒక్కడే కృపామూర్తి. కారుణ్యమూర్తి.

గైమార్డు

(సంకోచంతో) సెయింట్ ఎక్వర్డు నా అభిమానస్వామి.

బిస్కా

నిన్నుద్ధరింపగలడా?— నిన్ను —

గైమార్డు

లేదు. (కూర్చుండి) ఆ! రక్షింప గలదు.

బిస్కా

సరే చూద్దాం. (తలుపు తీస్తుంది. యవనిక రెపరెప కొట్టుకుంటుంది. గడ్డిజమ్ముమని ధ్వనిస్తుంది.)

గైమార్డు

(నోటికి చేతు లడ్డుపెట్టుకొని) తలుపుమూయి.

బిస్కా

ఆ విగ్రహాన్ని క్రిందకు విసరు.

గైమార్డు

ఆ కార్యం చేయలేను.

బిస్కా

చూచావా! సైమూన్ నాతల వెంట్రుక నొక్కటినైనా కదలింప కలుగుతుందా? సిన్నో!—నీవు మతద్రోహివి — నిన్ను నీ విగ్రహాలతో పాటు నాశనం చేస్తుంది.

గైమార్డు

(పతకాన్ని క్రిందకు విసరివేస్తాడు) దాహము. దాహము. నా ప్రాణాలు పోతున్నవి.

బిస్కా

ఏకేశ్వరుని ప్రార్థించు. అతడు కృపామూర్తి. కారుణ్యమూర్తి.

గైమార్డు

ఏమని ప్రార్థించను?

బిస్కా

నా మాటలనే పునరుచ్చరించు.

గైమార్డు

ఊఁ

బిస్కా

దైవం ఒక్కడే. వేరుదైవంలేదు. అతడు కృపామూర్తి. కారుణ్యమూర్తి.

గైమార్డు

దైవంఒక్కడే. వేరుదైవంలేడు. అతడు కృపామూర్తి. కారుణ్యమూర్తి.

బిస్కా

నేలమీద పడుకో (గైమార్డు అప్రయత్నంగా పడుకుంటాడు.) ఏమి వినిపిస్తున్నది?

గైమార్డు

సెలయూట గలగల.

బిస్కా

ఇలా చూడు. దైవం ఒక్కడే వేఱు దైవం లేడు. అతడు కృపామూర్తి. కారుణ్యమూర్తి. నీవేమి చూస్తున్నావు.

గైమార్డు

సెలయూట గలగల వినిపిస్తున్నది. విజన వీధులో పచ్చ తెరలున్న గవాక్షంచెంత దీపిక ప్రకాశిస్తున్నది.

బిస్కా

ఆ గవాక్షం చెంత కూర్చున్న దెవరు?

గైమార్డు

ఎలిసీ నా భార్య

బిస్కా

ఆ తెరమాటునుండి ఆమె వంపు గళాన్ని కౌగలించుకున్న దెవరు?

గైమార్డు

జార్జి. నాకుమారుడు.

బిస్కా

నీ కుమారుని కెంత వయస్సు.

గైమార్డు

నాలుగు సంవత్సరాలు.

బిస్కా

అయితే తెరచాటు నుండి పరకీయ కంబుకంఠాన్ని పరీరంభణం చేసికో గలడా?

గైమార్డు

అచ్చే! వాడు నా కుమారుడే.

బిస్కా

నాలుగేండ్ల వానికే నూనూగు మీసమా!

గైమార్డు

నూనూగు మీసమంటావా. ఆ!

అతడు జూల్సు. నా స్నేహితుడు.

బ్రిస్కా

తెరచాటు నుండి నీభార్య వంపు గళాన్ని కౌగలించుకున్న దెవరు?

గైమార్డు

హా! పాంశుడు.

బ్రిస్కా

నీ కుమారుడు కనుపిస్తూన్నాడా?

గైమార్డు

లేదు. కనుపించడం లేదు.

బ్రిస్కా

(ఘంటికాధ్వనిని గితారుమీద అనుకరిస్తుంది) ఇపుడేమి కనుపిస్తున్నది.

గైమార్డు

ఘంటికా ధ్వానం—శవవాసన— పులిసిన వెన్నవాసన వేస్తున్నది.

బ్రిస్కా

మృతశిశువు కోసం మ్రోయిస్తున్న వాద్యఘోష వినిపించడం లే?

గైమార్డు

ఉండు నాకు వినిపించడం లేదు. (గుబులుగా) వినిపించ వలెనని నీ యుద్దేశ్యమా? అయితే సరే. వినిపిస్తున్నది.

బ్రిస్కా

నీరవోత్సవంతో మోసికొని పోతున్న శవపేటిక మీద సురభిళిస్తున్న సుమదామాల్ని చూస్తున్నావా?

గైమార్డు

ఆ—

బ్రిస్కా

ఊదారిబ్బను మీద రజతాక్షరాల తో "జార్జెస్ ప్రియకుమారునకు వీడ్కోలు" నీ తండ్రి అని వ్రాసి ఉంది.

గైమార్డు

ఆ! సత్యమే. (రోదించును) జార్జెస్! జార్జెస్! హా! ప్రియతనయా! ప్రియా! ఎలిసీ! ననోన్నదార్చరావూ. చేయూతనీయవూ! (చుట్టూ అత్తాక్షి) అబ్బా! ఎక్కడ ఉన్నావు? ఎలిసీ నానుండి దూరమయ్యావా? పలుకవేమి? సమాధాన మీయవేం నన్ను ప్రేమించలే! నీ మనసార ఎవరిని ప్రేమించావు (ఇంటికప్పు మీదనుండి జూల్సు! జూల్సు!) జూల్సు? నా పేరు నా పేరేమి? నాపేరు చార్లెస్. ఆమె ఉచ్చరించిన పేరు జూల్సు. అబ్బా! ఎలిసీ! నీ యాత్మ ఇక్కడే తారాడుతున్నది. సమాధాన మియ్యి. నాకు తెలుసు. నన్ను తప్ప ఇంకెవ్వరిని ప్రే

మించనని మాటయిచ్చావు. జ్ఞాప కముందీ? (నవ్వు వినిపిస్తుంది) ఎవ రు నవ్వేవారు?

బిస్కా

ఎలిసీ. నీభార్య

గ్రైమార్డు

నన్ను హతమార్చివేయి— అబ్బా ఇక బ్రతుకలేను. జీవితం నరకం కం టే దుర్భరంగా ఉంది. నరకాన్ని ఎ ప్పుడైనా చూచావా? (తన ముం దు ఉమ్మికుని) నోట తడిలేదు-ఆరి పోయింది. దాహం. దాహం. లేక పోతే నిన్ను కరుస్తా — (బయట తుపాను)

బ్రిస్కా

(పెదవులకు వేల్లినితాటించి దగ్గి) హతమారిపో! ఇంకా కొన్నప్రాణం ఉండగానే నీ మరణశాసనం వ్రా యి. నీ వ్రాతపుస్తకం ఏదీ?

గ్రైమార్డు

(పుస్తకం,కలంతీసి) ఏమని వ్రాయ ను.

బ్రిస్కా

మానవుడు మరణించే ముందు భా ర్యా పుత్రులను తలపోస్తాడు.

గ్రైమార్డు

“ఎలిసీ. నిన్ను శపిస్తూన్నా—సై మూన్—నేను మరణించి పోతు న్నా”(వ్రాస్తాడు)

బ్రిస్కా

సంతకంచెయ్యి. లేకపోతే విలువ ఉండదు.

గ్రైమార్డు

ఏలా సంతకం చేయను.

బ్రిస్కా

వ్రాయి. ఇయాఇలాహాఅల్ అల్లా.

గ్రైమార్డు

(వ్రాసి) వ్రాశా. ఇంక ప్రాణాలు త్యజింప నచ్చా?

బ్రిస్కా

రణరంగంలో ప్రతివాసులను విస ర్జించి పారిన భీరసైనికుని లా మర ణించు. నీ ప్రేతంమీద సృగాలా లు పడి రోదనగానం చేస్తూ ఉండ గా నీ శ్రాద్ధోత్సవము చేయాలని కుతూహలమా? (యుద్ధగానం గి తారు మీద మ్రోయిస్తూ) భేరి ఝాంకణ నిక్వణాలు మ్రోయ సూ ర్యభగవానుడు, సైమూన్, ముం దు నడుస్తూండే మతవిద్రోహులు

మాటునుండి ఎదుర్కొంటున్నారు (గితారుమీటి) అని మొన మీద ఎలా తుపాకీ రవ్వలు విసరుతున్నారో! శ్వేతముఖులు నిస్తేజులవుతున్నారు. శ్వేతముఖులు చెల్లాచెదరయి పతేట్టు అరబ్బీయు లగ్ని గోళాల వర్షము కురిపిస్తున్నారు.

గైమార్డు

(లేచి) శ్వేతముఖులు వెన్నియరు.

బ్రిస్కా

(మురళిమీద పలాయన గీతమాలపించి) పలాయన గీతమాలపించగా శ్వేతముఖులు వెన్నిస్తారు.

గైమార్డు

ఆ! ఆ! పారిపోతున్నారు—వారు—పారిపోతున్నారు. నేను మాత్రం ఇక్కడే ఉన్నాను. (సైనికోద్యోగ చిహ్నాలు తీసి విరజిమ్ముతాడు) నా ప్రాణా లెగసిపోయాయి (నేల కొరగుతాడు)

బ్రిస్కా

అవును. నీ ప్రాణాలు పోయాయి. ఇప్పుడే— నీకు తెలియదుకాని- చాలాకాలం క్రితమే నీ ప్రాణాలు ఎగసిపోయాయి. (అస్థికల నుంచు మందిరములోకి వెళ్ళి కపాలం తెస్తుంది)

గైమార్డు

నేను మరణించినానా? (మొగము తడుముకుంటాడు)

బ్రిస్కా

ఇతః పూర్వమే! ఈ అద్దంలో చూచుకో (కపాలం చూపిస్తుంది)

గైమార్డు

ఆ! నేనే! నేనేనా!

బ్రిస్కా

నీ దవడ లెలా పైకి ఉబుకులెత్తాయో చూడు. నీ నేత్రాలను గృధ్రాలు పొడుచుకుని తినడంవల్ల ఎలా గుంట లేర్పడ్డాయో! ఇదివరకు నీవు ఊపతీయించుకున్న ఎడమదంతం వద్ద గుంట ఎలా కనిపిస్తుందో, నీ ప్రేయసి ప్రణయోద్వేలంతో ముద్దుల పూజచేసిన నీ చక్కనిగడ్డం ఎలా రంధ్రం పడిందో చూడు. నిదుర లేవగనే నీ ప్రియ తనూజాతుడు చంక నెగబ్రాకి ఆడుకొనే నీ పీనుగవ ఏదీ? రణభూమికి వెన్నిచ్చి వచ్చిన సిపాయి శిరస్సు నుత్తరించడంలో పరశువుకు తగిలి మెడవద్ద కేశాలు ఎలా చ్యుతమయ్యాయో!

గ్రైమార్డు

(కూర్చుని భీతావహంలో వింటున్న వాడు నేలకొరగి విగతజీవుడయ్యాడు)

బిస్క్రా

(మోకరిల్లి అతని నాడిని చూచి లేచి పాడుతుంది) సైమూన్. సైమూన్, (తలుపులు తీస్తుంది. జాలరులు కొట్టుకుంటవి. నోటికి వ్రేలు తాటించి ఆమె వెనక్కి విరిగిపడుతుంది.) యూసెఫ్.

తెర

———o———

తృతీయరంగము

(ఇదివరకు పాత్రలే: నేలమాళిగ నుండి యూసెఫ్ పైకివస్తాడు)

యూసెఫ్

(గ్రైమార్డుని పరీక్షించి బిస్క్రాకోసం చూస్తాడు)బిస్క్రా! (బిస్క్రాని చూచి ఎత్తి సందిట పొదివికొని) జీవించే ఉన్నావా!

బిస్క్రా

ఫ్రేంకు మరణించాడా?

యూసెఫ్

మరణించకపోతే, ఇప్పుడు తప్పక మరణిస్తాడు. సైమూన్. సైమూన్

బిస్క్రా

అయితే నేను జీవించే వున్నాను. దాహం.——మంచినీళ్ళు.

యూసెఫ్

(చేయూతనిచ్చి చిన్నద్వారము వద్దకు తీసికొని వెళతాడు) ఇదిగో- ఇంక యూసెఫ్ నీ వాడు.

బిస్క్రా

నీ కుమారుని మాతృశ్రీ బిస్క్రా. యూసెఫ్! యూసెఫ్!

యూసెఫ్

బిస్క్రా! నీవు సైమూన్ కన్న బలీయురాలవు.

తెర

ముగియిక



# స్త్రీ విరోధి

## ( రూపిక )

### శివశంకర శాస్త్రి

స్త్రీ గౌరవం తగ్గించుకుంటున్న
సోమనాథ వెల్లటూరుకి

[ఉదయం రమారమి యేడుగంట లు. మైసూరులో విద్యాశాఖాధి కారి భవనంలో ఒకపెద్దగది, కుర్చీ లు, మేజా, ఉంటవి. గోడమీద చెక్కపైన గిల్టుఅక్షరాలతో రాజ సభాభూషణ, విద్యావాచస్పతి, డా క్టర్ శ్యామశాస్త్రి అని కనబడు తుంది. ఒకపక్కన భర్తృహరి పట ము, రెండో పక్కన చిన్ముద్రపట్టి కూర్చున్న ఆచార్య శంకరుల పట ము, ఎత్తున బసవేశ్వరుని పటము. గదికి ఒక భాగంలో రమారమి ఆరడుగుల యెత్తుగను చెక్కతెర. ముందువైపు వరాండా. ప్రేక్షకుల కు ఇవన్నీ కనపడుతూ ఉంటవి.]

[లోపలనుంచి]

—కరిబసవా!

—అయ్యా...!

—స్నానానికి నీళ్ళు తోడావా?

—చిత్తం.

వరండాలోనించి గదిలోకి వెళతా రు ఎవరో ఇద్దరుస్త్రీలు. పెద్దామె మధ్యమప్రమాణం. షుమారు 36 సంవత్సరాలు. కొద్దిగా మాసిన సౌందర్యచిహ్నాలు ఇంకా కనబడు తూనే ఉన్నవి. కళ్ళకుజోడు, ము ఖాన బొట్టులేదు. రెండో యువ తికి 22 సంవత్సరాలు.

అశ్వత్థమ్మ: నాకేమిటో భయం వే స్తున్నది అత్తయ్యా:

సక్కమ్మ: ఏంభయం? నే నుంటిని గా. చెప్పవలసిందంతా చెబుతా.

అ: ఈరోజుల్లో ఆయన నీమాట వింటా డనుకోను.

స: ఈమొగవాళ్ల సంగతి నీకు తె లియదులేవే.

అ: ఆయన సంగతులు విన్నకొద్దీ ఏమో వణుకు పుడుతున్నది. ఆడ వాళ్లను ఆవరణలోకే రానియ్య డట. ఆమధ్య స్త్రీసమాజ సభకు అధ్యక్షులుగా రమ్మని ప్రార్థిస్తూ ఆహ్వానం పంపితే వీ ల్లేదని కఠినం గా జవాబు వ్రాశాట్ట.

స: కాగితాలమీద అంతే లే. కళ్ల యెదట బడితే, అంతబెట్టు ఉండదు

అ: నువ్వంటున్నావు గాని అత్తా!

ఆవరణలో అడుగు పెడితేనే కాళ్లు గడగడలాడినవి. నువ్వు బలవంతాన లాక్కొచ్చావు గాని......

స: ఆ బాధ్యత నాది. మాట్లాడకుండా ఊరుకుంటే మరొకళ్ళకి ఉద్యోగం ఇస్తే!... అప్లికేషన్లతో పనులూ, ఆశీర్వచనాలతో బిడ్డలూ... ఆ రోజు లనుకుంటున్నావా?

అ: బిడ్డలు కననిదానికి నీకూడా...

స: (చిరునవ్వుతో) చిన్న సన్నాసివి నీ కేం తెలుస్తుంది.

అ: కొంతమందికి సిఫారసు అంటే కోపం. ఒకవేళ నాకే ఆర్డరు వేస్తారేమో! ... నువ్వు చెప్పడం వల్ల మొదటికే మోసం రాదు కదా?

స: ( గర్వంగా ) వెర్రి నాగమ్మా! ఆయన స్నేహితుల సిఫారసు తప్పకుండా వింటాడు.

అ: మంచిమాటే. నీ మాట వింటాడని ఏం నమ్మకం? నీ వేమి ఆయన స్నేహితురాలివా?

స: [పెదవి కొరికి, కళ్లల్లో వింత వెలుగుతో] అవుననుకో!

అ: [విప్పారిన కళ్లతో] నిజంగానా? నీ కేదో దూరపు పరిచయమేమో అనుకున్నా. స్నేహితు రాలంటే—

స: [కొంచెం దగ్గి దస్తీతో ముఖం తుడుచుకుని] స్నేహితురా లంటే స్నేహితురా లన్నమాటే!

అ: నా కెప్పుడూ చెప్పావు కాదు. అదా నీ ధైర్యం! అందుకా నన్ను తీసుకొచ్చావు? — ఆయనకు నీ మీద...

స: ఆయన పెళ్లి ఎందుకు మానేశా రనుకున్నావు? [మందహాసం చేస్తుంది]

అ: చాలాగాథ ఉన్నట్లుందే! అయితే నువ్వు ఆయన్ని పెళ్లాడక మామయ్యా నెందుకు పెళ్లాడావు?

స: ఆయన్నే పెళ్లాడి ఉంటే నీ కత్తయ్య నయ్యేదాన్ని కాదు. నాకీ వైధవ్యం వచ్చేది కాదు. నిన్నివ్వాళ ఇక్కడికి తీసుకువచ్చేదాన్ని కాదు. [కొంచెం వికటంగా నవ్వుతుంది]

[పదిహేను సంవత్సరాల కుర్రవాడు చెక్క తెర వెనకనుంచి వస్తాడు. సన్నగా పొడుగ్గా వుంటాడు. వీళ్లను చూసి ఆశ్చర్యంతో]

క: ఎవరమ్మా మీరు?

స: ఎవరమని చెప్పితే నీకు తెలుస్తుంది?

క: ఎందు కొచ్చారు?

స: పనుండి వచ్చాము.

క: తమకు తెలియదూ...... !

స: ఏమిటి తెలియదూ...... ?

అయ్యగారు ఇంట్లో లేరా? ఇవాళ ఆదివారం కాదూ?

క: ఉన్నా లేనట్టే.

అ: అయితే అత్తయ్యా! వారు Not at home కాబోలు.

స: ఉన్నా రని చెబుతున్నాడుగా! బుల్లేడా! అయ్యగారికోసం ఎవరో వచ్చారని చెపుతావా?

క: చెప్పి బతకడమే!

స: తంతారా యేమిటి?

క; శివశివా! వారు చాలా సాధువులు.

స: అయితే నీ కంత గాభరా యెందుకు?

క: ఆడంగు లెవరూ రా గూడదమ్మా ఇక్కడికి.

స: ఏం వొస్తే యేం?

క: ఇదివరకు వచ్చిన వాళ్ళ సంగతి ఏ మయిందో తెలిస్తే యిలా మాట్టాడరు.

అ: [కొంచెం భయంతో] అయితే వెళ్లిపోదామా అత్తయ్యా!

స: ఉండవే వెర్రిపిల్లా! ఆడవాళ్లకవమానం చేస్తారా? మీఅయ్యగారు చాలా మంచివారు అంటున్నావు.

క: అవును. దర్వాంజీ వచ్చిన స్త్రీలను బయటికి పంపేస్తాడు.

స: అలాగా! అయితే అయ్యగారి జవాన్లకు మర్యాద మహా బాగా తెలు సన్నమాట!

క: జవాన్ల దేముంది? అయ్యగారి హుకుం.

అ: తక్షణం మనం వెళ్లిపోవడం మంచిది అత్తయ్యా!

స: లేకపోతే గెంటించేస్తారా? అదీ చూద్దాం!

క: తమ రసలు లోపలి కెట్టా వచ్చారు?

స: గోడమీదగా వచ్చా మనుకున్నావా? రాజమార్గానే వచ్చాం!

క: లోపలికి వెళ్లొద్దన లేదూ మిమ్మల్ని ఎవరూను?

స: వొద్దంటే ఎందుకు వస్తారు ఆడవాళ్లు?

క: అయితే ఇవ్వాళ దర్వాంజీపని అయిం దన్నమాటే. ఎక్కడికి పోయాడో పాపం!

స: ఏం అతన్ని డిస్మిస్ చేస్తారంటావా?

క: తమరు దయచేసి వెళ్లండమ్మా!

అ: నీ కంతకష్ట మెందుకోయ్! అయ్యగారిని చూడడానికి వచ్చాం. వారితో పని అయిపోగానే వెళ్ళిపోతాం.

క: తమరు వెళ్లండమ్మా! మాటా

స్తుంది నాకు. ఆడంగు లెవరూ ఇక్కడికి రారు—రాగూడదు.

స: విద్యావ్యవహారంలో వచ్చాంలే

క: ఆఫీసుకు వెళ్ళాలిసిందే గాని ఇంటికి రాగూడదండి.

స: ఆమాత్రం తెలుసు లేవోయ్! వొద్దంటే వస్తారను కున్నావా?

[కరిబసవ కొంచెం ఆశ్చర్యంతో నోరు తెరచి చూస్తాడు.]

అ: శాస్త్రిగారు ఏం చేస్తూన్నారు

క: స్నానం చేస్తూన్నారు. అయిపోవచ్చి వుంటుంది.

[లోపలనుంచి]

కరిబసవా!

క: అయ్యా [అని వెళ్ళిపోతాడు]

అ: అసాధ్యురాల వత్తయ్యా నువు!

స: ఆయనచేత అప్లికేషన్ మీద మంజూరు ఆర్డరు వేయించిన తరవాత అను ఆ మాట.

అ: ఎటువంటి వాళ్ళనూ నేర్పుతో లొంగదీసేశక్తి ఉన్నది నీకు! నీకోసం ఆయన వివాహం మానివేశాడంటివే, ఆయనమీద నీకూ ప్రేమ వుండేదా?

స: (నవ్వి) ఏ ముంటే ఏం లాభం? అదంతా కొన్ని చిక్కులవల్ల తారుమారయి పోయింది!

అ: ఆయనే వొద్దన్నాడా? నువ్వే మానేశావా? నీ రహస్యా లడుగుతున్నా నేమో అని భయమేస్తోంది!

స: నాసంగతి రహస్యమూ—రహస్యమూ కాదు.

అ: అంతా తికమకగా వుందే.

స: ఆయన తప్పేమీ లేదు. నేను నడచిన చోటు ముద్దు పెట్టుకునే వారు ఆయన నాకోసం అన్నీ త్యాగం చేశారు.

అ: అయితే నువ్వెందు కాయన్ని అంగీకరించ లేదు?

స: కొంత తెలివి తక్కువ వల్లా, కొంత పట్టుదలవల్లా, కొంత పొగరుబోతుత్వంవల్లా.

అ: అనగూడదు గాని చాలా పొరపాటు చేశా ననుకుంటాను.

స: ఏదో అయిపోయింది.

[లోపల]

మేజామీద పళ్లూ పాలూ పెట్టు

—— చిత్తం.

(శ్యామశాస్త్రి ఉత్తరపువేపున ఉన్నద్వారం గుండా ప్రవేశిస్తాడు. అతిదీర్ఘకాయుడు సన్నగా పచ్చగా స్ఫురద్రూపి. షరాయి, షర్టు తొడుక్కొని వున్నాడు. 30 మొదలు 50 వరకు ఎంతేనా కావచ్చు వయసు. "పుష్పవిద్దంతె మొగ్గెయనర్పిసికొండశివను పక్వవాద ఫలవిద్దంతె కసుగాయ కొద్దయశివను" అని పాడు

తూవచ్చి" స్త్రీలను చూసి కొద్దిగా ఉలికిపడి అడుగు వెనక్కి వేసి కరి బసవా! అని అప్రయత్నంగా అంటాడు. స్త్రీలిద్దరూ లేచి నమస్కారం చేస్తారు.)

శ్యా: ఎవరమ్మా తమరు?

స: (గొంతు సవరించుకుని) క్షమించాలి. తమ దర్శనం చేసుకువెళ్లాలని వచ్చాం.

శ్యా: నా దర్శనానికా?...ఏముంది నన్ను చూచేందుకు?

స: క్షమిస్తే ఒక చిన్న...

(కరిబసవ వచ్చి కిటికీపక్క నిలబడి శాస్త్రి కేసి చూస్తూవుంటాడు)

శ్యా: ఇక్కడ...వాతో ఏంపని?

స: ఆఫీసులో అందరూ వుంటారు. ఇక్కడైతే తమతో సావకాశంగా మనవి చేసుకుని...

శ్యా: తమరు ఆఫీసుదగ్గిరకే రావచ్చునే నాకు కొంచెం పని ఉన్నది. [అని కిటికీకేసి చూచి] బసవా! గదిలో అవి పెట్టావా?

క: చిత్తం! పెట్టేస్తున్నాను. [వెళ్లుతాడు.]

స: తమ పనికి మేము అడ్డురాలేదు గదా! అయినా క్షమిస్తే రెండునిమిషాల్లో తమ అమూల్యమైన కాలం...

శ్యా: (ఏదో ఆలోచించి) వేగిరం చెప్పండి.

స: తమరు నిలుచునే వున్నారు...

శ్యా: ఫరవాలేదు. చెప్పండి...వేగిరం.

స: ఈ అమ్మాయి మామేనగోడలు యం.ఏ. ప్యాసు చేసింది...

శ్యా: అలాగా...

స: తమపేర అప్లికేషన్ పెట్టుకున్నది.

శ్యా: ఎప్పుడు?

అ: అటుమొన్న.

శ్యా: సరే నీపేరు?

అ: అశ్వద్ధమ్మ.

శ్యా: అశ్వద్ధమ్మ.వి.?

స: చిత్తం. తమదృష్టి నాకర్షించిందన్నమాట.

శ్యా: మూడే అప్లికేషన్‌లు వచ్చాయి. కొంచెం గుర్తువున్నాయి. సరి తమ రెందుకు వచ్చినట్లు?

స: ఈ విషయమే మనవిచేతామని

శ్యా: చెప్పారుగదా. తమరిక వెళ్లవచ్చు.

అ: (దిగాలుపడి చూస్తుంది.)

స: అంటే, కొంచెం తమరు అనుగ్రహించి...

శ్యా: అంతులో అమ్మాయి యోగ్యతలన్నీ వ్రాశారు కదా!

అ: చిత్తం.

శ్యా: సరే. దాన్నిబట్టి చూస్తాను.

స: ఇంకా అప్లికేషన్లు ఉన్నవని సెలవిచ్చారు. కొంచెం అభిమానించి...

శ్యా: అది ధర్మం కాదు. వచ్చిన వాటిల్లో యోగ్యతను బట్టి యివ్వడం న్యాయంగదా!

స: తమరు సెలవిచ్చింది యదార్థం కాని ...... అమ్మాయి స్థితిగతులు...

శ్యా: ఏంచేస్తాం? (చేతిగడియారం చూసి) నాకు కొంచెం పని ఉన్నది......

స: సెలవు పుచ్చుకుంటాము. కొంచెం జ్ఞాపకం ఉంచుకుని తమరు ఉద్యోగం ఇస్తే అమ్మాయి ఒడ్డున పడుతుంది. చాలాచిక్కుల్లో వుంది.

శ్యా: మీరు విశేషించి చెప్పనక్కర్లేదు. యోగ్యతనుబట్టి తప్పక నేనే యిస్తాను.

స: ఉన్న డబ్బంతా చదువు కయిపోయింది. పెద్దవాళ్ళంతా పోయినారు. వివాహం కాలేదు.

శ్యా: వివాహం చేసుకోడం మంచిది. స్త్రీలకు ఉద్యోగంవల్ల ఎక్కువ సుఖం ఉండదు.

స: యధార్థం.

శ్యా: ఒకరి విషయాల్లో నేను జోక్యం పెట్టుకోడం అంత మంచిది కాదు. అయినా పెద్దవాణ్ణి గనుక చెబుతున్నాను. అమ్మాయికి వేగిరం వివాహం చేసెయ్యండి.

స: తమసలహా అమూల్యమయింది. కాని తగినవరుడు దొరకలేదు.

శ్యా: (చిరునవ్వుతో) తగిన వరుడంటే సమస్త సద్గుణాలూ వుండాలి- భూవసతి వుండాలి—బ్యాంకులో డబ్బుండాలి—ఉద్యోగంలో ఉండాలి— అప్పుడుగాని స్త్రీ అంగీకరించదామె!

స: [కొంచెం వికటంగా నవ్వి] హిరణ్యాక్షవరాలు కోరడం లేదు మేము, ఏదో గౌరవంగా జీవించగలిగితే చాలు. అమ్మాయి యం.ఏ. అయింది కాబట్టి అతనుగూడా...

శ్యా: తెలిసింది. మనదేశంలో విద్యావతులకు వివాహం కావడం కష్టం. వాళ్ళనుసంతృప్తిపరచడం కష్టం. (సక్కమ్మ కళ్ళల్లోకి చూస్తాడు)

స: (చూపులు క్రిందికివాల్చి) అంతా అలా వుంటారా? ఎవరో బుద్ధిహీనతవల్ల ......

శ్యా: అమ్మాయి అప్లికేషన్ మూడింటిలోకీ మంచిదే అనుకుంటాను

అ: తమరు అనుగ్రహించాలి.

స: చాలా సంతోషం తమరు నా మాట మన్నించినందుకు చాలా

కృతజ్ఞురాలిని.

శ్యా: ఇందులో మీరు కృతజ్ఞత చూపవలసిం దేమీ లేదు. (గడియారం చూసి) మంచిది. (అంటూ చెక్క తెరచాటుకు వెళుతాడు)

ఇద్దరు: సెలవు. కృతజ్ఞులం! (వరండాలోకి నడుస్తారు)

స: అమ్మాయి! నువ్వు ముందు పద. నేను వస్తాను.

అ: ఇంతకూ అర్థరు పడేనా అత్తయ్యా?

స: ఇంకా అనుమానమే వెర్రిపిల్లా!

అ: ఏమో చాలా భీకరంగా వుంటా డనుకున్నాను. శాంతంగా నే మాట్లాడాడే!

స: నేను తీసుకు వచ్చిందెందుకూ!

అ: నా పెళ్లి సంగతి పట్టుకున్నాడేం?

స: వెనకటి సంగతులు తలుపుకు వచ్చి నీకు సలహా యిచ్చి వుంటాడులే. అయినా మంచి మాటేగా!

అ: నన్ను ముందు వెళ్లమంటావు. ఇంకా ఏమన్నా మాట్లాడాలా?

స: నేను వెళ్లి ఆర్డరుసంగతి గట్టిచేసుకొస్తాను నువ్వు పద.

అ: సరే (సక్కుమ్మ తలుపు తెరచుకుని లోపలికి వెళ్లుతుంది చప్పుడు లేకుండా. శ్యామశాస్త్రి కుర్చీలో కూర్చుని మేజామీద పాల గ్లాసులో ఉన్న ఆవిరి కేసి అలా చూస్తూవుంటాడు. ఎడంచేతులో ఆపిల్ పండు కుడిచేతిలో చాకు, ఎదురుగా ప్లేటులో ద్రాక్ష పండ్లగుత్తి, కొంచెం ఆవతలగా సక్కుమ్మ నిలబడి ఆయనవేపు చూస్తూ ఉంటుంది. గడియారం అర్ధగంట కొడుతుంది. శాస్త్రి రెప్ప లార్చి తిరిగి చూస్తాడు.)

స: (చిరునవ్వు) క్షమించాలి తమతో ...

శా: నాతో... (మొగం చిట్లిస్తాడు.)

స: (కొంచెం ముందుకు వచ్చి) నన్ను తమ రవడంమాని, ఏకవచనంలో సంబోధిస్తే......

శ్యా: ఎందుకులెండి. అతిపరిచయా దవజ్ఞతా.

స: ఎంతమాట! మళ్ళీ 'అండీ' అంటున్నారు. వెనకటిలాగ నీవు అంటే నా కెంత ఆనందంగా ఉంటుంది......

శ్యా: వెనకటిలాగ......! నాది వర్తమానకాలమే ఎప్పుడూ.

స: హిబ్రూభాషలో వర్తమానకాలం లేదనితమకు తెలుసుగా. వర్తమానం ఉత్తరక్షణమే భూతమైపోతూ వుంటుంది.

శ్యా: ఆజాతికంతే-కుడినుంచి ఎడ

మకు ప్రవాసేజాతికి!

స: "ప్రత్యాయాన్తి గతాః పున ర్న దినసాః"

శ్యా: నిజమే. వాటిని తవ్వివెత్తడం వల్ల ఉపయోగం ఏమిటి?

స: నన్ను కూర్చో మన్నైనా అన్నా రు కారు!

శ్యా: (తటపటాయించి) కూర్చో ...దేనికి మళ్ళీ వచ్చావు?

స: మీకు కృతజ్ఞత చెప్పి వెళ్లడా నికీ......

శ్యా: కృతజ్ఞతతో పనిలేదు. నీవు చెప్పినందువల్ల అమ్మాయికి ఉద్యో గం ఇవ్వడం లేదు. అర్హత నుబట్టి ఎలాగూ వస్తుంది. అయినా నీకు కృతజ్ఞతకూడా ఉందా?

స: (కొంచెం విచార ముఖంపెట్టి) కృతజ్ఞత తెలుపడానికీ ... క్షమా పణ కోరడానికీ... వచ్చాను.

శ్యా: క్షమాపణతో పనిలేదు. అ యినా క్షమాపణ యెందుకు?

స: మీది ఉదారహృదయం కాబ ట్టి క్షమాపణ అవసరం లే దంటు న్నారు. కాని నేను మీ విషయం లో చేసినదానికి ఎన్నిక్షమాపణలు చెప్పినా చాలదు.

శ్యా: క్షమాపణ కోరడంగాని, అం గీకరించడంగాని కొందరికి గిట్టదు.

స: అవును. క్షమార్హం కానిపనులే చేశాను.

శ్యా: ఎందు కవన్నీ యిప్పుడు? వాటికి మైనారిటీ కూడా దాటిపో యింది.

స: మీ క్షేమాత్రం సంతానం?

శ్యా: (నవ్వి) ౩౫ కోట్లు.

స: జగత్కుటుంబు లన్నమాట!

శ్యా: నేను వివాహమాడిందీ లేనిదీ మైసూరురాష్ట్రానికి తెలుసు.

స: నేను ఈ మధ్యనే మైసూరు రాష్ట్రంలో అడుగు పెట్టాను.

శ్యా: ఆలాగా? నీ క్షేమాత్రం సం తానం?

స: ౩౫ కోట్లు. మీమోస్తరే!

శ్యా: జగత్కుటుంబిని వన్నమాట

స: వివాహం అయింది గాని కాప రం చెయ్యలేదు.

శ్యా: వివాహవిధికి నవీనధర్మం ఆ పాదించావు.

స: కొద్దిరోజులకే ఆయన పోయా రు.

శ్యా: మరదృష్టవంతుడు. పునః...

స: [శాస్త్రివైపు నిదానించి చూ సి] అనుకున్నాను కాని ఆయన లభ్యం కాలేదు.

శ్యా: నీ వనుకుంటే లభ్యం కానిది ఉంటుందా?

స: నాకు గొప్పశక్తులు ఆపాదిస్తు న్నారు. ఆయన ఇండియా వొదిలి

పెట్టి వెళ్లారు.

శ్యా: సముద్రాలు నీ కడ్డం కావే!

స: అంత సాహసించ లేను. స్వదేశానికి వచ్చినాక వారిని చేపట్టుదామనుకున్నా.

శ్యా: [పరధ్యానంగా వుండి పాల గ్లాసు ముట్టుకొని చప్పున చెయ్యి తీసుకుని] ఇంకా వేడి తగ్గలేదు.

స: నేను చల్లారుస్తాను ఉండండి. [పాలు మరో గ్లాసులో చల్లార బోస్తుంది.]

శ్యా: వొద్దువొద్దు. చెయ్యి కాలుతుంది. మీకెందుకు శ్రమ.

స: మళ్లీ "మీ" వచ్చిందే?

శ్యా: తరవాత ఏం చేశావు?

స: ఆయన సంగతి భోగట్టా చేశాను. అలభ్యమని తెలుసుకున్నా.

శ్యా: తెలుసుకుని?

స: పశ్చాత్తాప పడ్డాను. బహుకాలం బాధపడ్డాను.

శ్యా: సకాలంలో దేన్నికైనా విలువ ఉంటుంది.

స: దాటిపోయిన తరవాతనేగా విలువ తెలిసేది?

శ్యా: కొన్ని అమూల్యాలు.

స: నిజం! కొన్నింటికి మూల్యం కట్టలేము. కొన్నింటికి మూల్యం ఉండనే ఉండదు...... మీరు వివాహం మానడానికి కారణం తెలుసుకో వచ్చునా?

శ్యా: నీకు తెలుసనుకుంటాను.

స: [ఆశతో] ఒకవిధంగా తెలుసు. ఈ దౌర్భాగ్యురాలే కారణం! అప్పుడు కొంత చిన్నతనం, కొంత అహం, కొంత దురభిప్రాయం, అన్నిటికంటె పెద్దవాళ్ల పోరు———

శ్యా: పెద్దవాళ్లంటే నీకు లక్ష్యమే ఉన్నమాట. పితృవాక్య పరిపాలనలో రాముడి తరవాత నువ్వే!

స: పెద్దవాళ్లకు మతు లుండవని సృష్టి దగ్గరనుంచీ నా దాకా రూఢి అవుతున్నది.

శ్యా: ఇంతకూ పెద్దవాళ్ల మాట విని చెడ్డట్టా? వినక చెడ్డట్టా.

స: రెండింటి సాంకర్యంవల్ల.

శ్యా: ఈ కళ్లజో డెప్పటి నుంచీ?

స: దృష్టి చెడ్డ దగ్గర నుంచీ. మీ బోటివారి దృష్టికి మట్టుకు మాంద్యం లేదు.

శ్యా: క్రమ సాధనవల్ల.

స: శరీరం కాపాడు కుంటున్నట్టున్నారు? [ధర్యం చేసి] స్త్రీస్పర్శ లే దనుకుంటాను.

శ్యా: [నిరసన భావంతో] ఈ దేహం శివార్పితమై పోయింది చిన్నప్పుడే. [తీవ్రంగా] స్త్రీని తాకి శరీరం అపవిత్రం చెయ్య దలుచుకో లేదు.

స: క్షమించాలి. పొరపాటున అన్నాను. మీకు మనోదార్ఢ్యం వుంది.

శ్యా: ఒకపట్టునరాలేదు. నీ గురూపదేశంవల్లనే వచ్చింది.

స: ఎంతమాట! అప్పుడు మీ స్పర్శవల్ల నాశరీరం పవిత్ర మైంది.

శ్యా: మధు తిష్ఠతి వాచి యోషితామ్.

స: ఇంతకూ క్షమించా నంటే మనశ్శాంతితో సెలవు తీసుకుంటా.

శ్యా: ఒకరు నా కపకారం చేశారని గాని, నింద లారోపించా రని గాని, కృతజ్ఞత చూప లే దని గాని, అనుకునేవాణ్ణి కాదు. క్షమాపణ అవసరం లేదు.

స: మీ జ్ఞాపకచిహ్నంగా ఆ నంది విగ్రహం ఇప్పిస్తారా!

శ్యా: [కొంచెం తటపటాయించి] తీసుకోవచ్చు.

స: మీ చేతిమీదుగా......

[శ్యామశాస్త్రి చేత్తో ఇస్తుంటే సక్కుమ్మ చెయ్యిపట్టుకుని ముద్దుపెట్టుకుని విగ్రహంతీసుకొంటుంది]

స: సెలవు. తిరిగి దర్శనం చేసుకుంటాను. [నెమ్మదిగా వెళ్లిపోతుంది.]

శ్యా: [రెండు చేతులతో తలపట్టుకుని కొంచెమాగి] కరిబసవా!

క: (ప్రవేశించి) అయ్యా!

శ్యా: కిటకీలో నుంచి చూడు. ఆ అమ్మగారు వెళ్లిపోయిందా?

క: (చూచి) చిత్తం. గేటుదాటి వెళ్లారండి.

శ్యా: ఈ పళ్లూ పాలూ, తీసి పారవెయ్యి.

క: (ఆశ్చర్యంతో) చిత్తం.

శ్యా: స్నానానికి నీళ్లు తోడు.

క: స్నానం అయింది కదండి.

శ్యా: (తీవ్రంగా) వేడినీళ్ళు తోడు. మళ్ళీ స్నానం చెయ్యాలి.

క: [దిగ్భ్రమ చెంది] చిత్తం, చిత్తం (అంటూ మేజామీది వస్తువులు తీస్తూ ఉంటాడు.)

తెరపడుతుంది.

# నిరుద్యోగ సమస్య

శ్రీపాద గణపతిరావు, ఎం.ఏ. (ఆనర్సు)

**(The Problem of Un-employment among the Educated classes of South India)**

నిరుద్యోగ సమస్య ప్రస్తుతము హిందూ సంఘమునకు వేరుపురుగై యున్న దను విషయము అందఱును తెలిసినదియే. అనేకులు ఉన్నత విద్య నభ్యసించి అత్యుత్సాహవంతులైన యువకులెందఱో చేయుటకు పని లేక ప్రపంచాన్ని అసహ్యించుకొనుచు ఖిన్నులై తిరుగుచున్నారు. ఈ సమస్య అన్ని దేశముల నావరించియున్నను మన దేశ దరిద్ర స్థితివలన ఇక్కడ మరీ విషాదకరంగా పరిణమిస్తుంది. కొందఱు పి. హెచ్.డి. డిగ్రీతో సబ్-రిజిస్ట్రారు ఉద్యోగముకొఱకును, మరికొందఱు బి.ఏ, యమ్.ఏ డిగ్రీలతో పోలీసు కానిస్టేబుల్ (Police Constable) ఉద్యోగము కొఱకును ప్రయత్నించుట తెలియవచ్చుచున్నది. పాలమ్ముకొనువారి లోను, బండి లాగుకొను వారిలోను కొందఱు బి.ఎ, యమ్.ఎలు ఉండుట మన మెఱుగుదుము. ఇట్టివి సంఘమునకు, విశ్వవిద్యాలయములకును గూడ సిగ్గు తేవలసిన విషయములు కావని యెవ్వరనగలరు? మనదేశమున అసలు నిర్వ్యాపారుల సంఖ్య షుమారు 4 కోట్లుండునని చెప్పెదరు. మన చెన్నరాజధాని లోను 4½ కోట్ల జనులకు షుమారు 21 000 ఉన్నతవిద్య నభ్యసించు విద్యార్థులు గలరు. వీరిలో నూటికి 60-70 మందిని నిరుద్యోగులుగా గ్రహింపవచ్చును. ఇప్పుడు విద్య నభ్యసించు వారిలో సగముమందికే ఉద్యోగము లుండునని మద్రాసు నిరుద్యోగకమిటీవారు చెప్పియున్నారు. ఇంతటి ప్రబలమగు నిరుద్యోగము ప్రజాక్షేమమునకు, ప్రభుత్వ పరిపాలనమునకునుగూడ మిక్కిలి అపాయకరమని సాడ్లర్ కమీషన్ వారు (Sadler Commission) వెనుక నిస్సందేహంగా చెప్పియున్నారు. కనుక ప్రస్తుతము మన దేశమునకిట్టి దుస్థితికి కారణము లెవ్వియో, దానిని తొలగించుటకు

మార్గము లెట్టివియో, తెలిసికొనుట అత్యవసరమని వేరే చెప్పనక్కరలేదు. కాని ఈ దుస్థితికి కారణములు సామాన్యముగా నందరకు తెలిసినవియే. అందు కొన్నింటి నీక్రింద ఉదహరించెదను.

(1) ఈ సమస్య ఒకటి రెండు సంవత్సరములలో పుట్టినదిగాక ఐరోపా మహాసంగ్రామము అంతమైన వెంటనే పుట్టినదని చెప్పవచ్చును. యుద్ధానంతరము అనేక మందిజనులను ఉద్యోగములనుండి తొలగించివైచిరి. వీరికి మరల వెంటనే ఉద్యోగములు లభించు మార్గములు లేకపోయెను. అదియు గాక యుద్ధకాలములో చేసిన వృథా ధన వ్యయమునకై అప్పటినుంచి నేటివరకు ఉద్యోగవర్గములందు 'రిట్రెంచ్ మెంటు' ను చేయుచునే యున్నారు.

(2) మనదేశములోని విద్యావిధానము కూడా ఈ నిరుద్యోగ సమస్యకు ముఖ్యకారణముగా నున్నది. అవసరముల తోడను, ఆదర్శముల తోడను, సంబంధములేక నిరుపయోగమై నిరాశను కల్గించుచున్నది. పూర్వమెప్పుడో ప్రభుత్వము వారు వారి పాలనాసౌకర్యము కొఱకు లేఖరులను తయారు చేయుటకొరకై సృష్టింపబడిన విద్యావిధానము నేటివరకును అంతకంటె ఘనమగు ఆదర్శము లేకుండపోయెను. దేశము మాత్రము అట్టి నీచస్థితిలో లేక మిగిలిన యన్నిశాఖలలోను అభివృద్ధి పొందినది, పొందుచున్నది. వ్యవసాయమే ముఖ్యవృత్తిగా నుండిన దేశము పరిశ్రమలవైపు దృష్టి మరల్చినది. కేవలము ఆధ్యాత్మికముగా నుండిన దేశము ఈలోకమునుగూడ చూచుచున్నది. కనుక ఇప్పటి విద్య స్వదేశాభ్యుదయమునకు కేవలము నిరుపయోగముగానున్నది. ఇంక విద్యనభ్యసించిన యువకులకు దేశసేవకు అవకాశమేది? జీవనోపాధియేది? దేశోద్ధరణమునకు ప్రధానహేతువగు విద్యాశాఖయు నాయకులగు యువకులును ఇట్టిస్థితిలోనుండ దేశమునకు ముక్తియెక్కడ? పరిశ్రమల నుద్ధరించుటకు తగిన విద్య విరివిగా వ్యాపింపజేయువరకును మన విశ్వ విద్యాలయ

ములు తమ ధర్మమును నెరవేర్పజాలక సంఘమునకు నిరుపయోగమగు యువకులనే తయారుజేసి నిరుద్యోగ సమస్యను వృద్ధిచేయుచునే యుండును.

(3) ఈ నిరుద్యోగ సమస్యకు సాంఘికములగు కొన్ని కారణములు కూడ గలవు. మనదేశమున వర్ణభేదము (Caste System) నెక్కువగా భావించుటచేత విద్యావంతులగు యువకులు వారివారి వర్ణములకు యుక్తముగా ననుకొనెడి ఉద్యోగముల తక్క యితర వృత్తులకొఱకు ప్రయత్నించరు. మరియు మన దక్షిణ దేశమున ముఖ్యముగా బాల్య వివాహములు విస్తరించి యుండుటచేత ప్రతి యువకునకును తనను పోషించుకొనుటయేగాక తన భార్యాబిడ్డలను పోషించుకొనుటయు పెద్దసమస్య అగుచున్నది. సమిష్టి కుటుంబవిధానము (Joint family) మనదేశమున స్వయంకృషిచే జీవనము చేయు ఆశయమును తప్పించి కేవలము పారతంత్ర్యమును వహింపజేయుచున్నది. ఇది విద్యావాసన లేని సామాన్యజనులకు అంత బాధకరముగా కన్పించక పోయినను ఉన్నతవిద్య నభ్యసించి, ఉన్నతాశయములను మనమున నాటుకొని ఉద్రేకము, ఉత్సాహముగల యువకులకు పారతంత్ర్యముకంటె ఆత్మహత్యయే ఉత్తమమని అనిపించును గదా.

(4) ఈ పై నుదహరించిన కారణము లన్నిటికంటెను ఈ నిరుద్యోగమునకు మనదేశముయొక్క ఆర్థిక స్థితియే ప్రధానహేతువై యున్నది. ఆంగ్ల దేశములో సైన్యము, నౌకాదళములను గణింపకుండినను మిగిలిన ఉద్యోగముల సంఖ్య షుమారు 16 000. కాని మనదారిద్ర్యము మన దేశములో అట్టి ఉద్యోగముల సంఖ్యను 40 మించనీయలేదు.

అనేక కారణములు కలిగిన నిరుద్యోగ సమస్యను తొలగించుటకు మనదేశములో ఒక పరమ సాధన మేదియు కనబడదు. సాధింప గల్గినను అది ఒకనాటి పనియుగాదు. దారుణమగు ఈ సంఘజాడ్యము

నకు పెద్దలు పలువిధములుగా సాధనములను చెప్పెదరు. అందు కొన్నింటిని తఱచుగా చెప్పుటచేత, సామాన్య సాధనములని అనిన ననవచ్చును. కాని యువ సంఘములోకాని, విశ్వ విద్యాలయముల లోకాని, ప్రభుత్వములోకాని, తుదకు యువకులలోగాని తగినంత ఉద్రేకమును కలిగించినట్లుగా కనబడుట లేనందున తిరిగి కొన్నింటిని ఈ క్రింద పొందుపరచెదను.

(1) ముఖ్యముగా పాశ్చాత్యదేశములతో పాటు మనదేశమునను పరిశ్రమలను వృద్ధిచేసి ఆర్థికస్థితిని బాగుచేసిన యెడల ఈనిరుద్యోగ సమస్య కొంతవఱకు తీరుననుటకు సందియము లేదు. ఈదేశమున ఇంకనుఎంతయో దూరము 'రైల్వే' వేయవలసి యున్నది; ఎన్నియో నీటివసతులు కల్గింపవలసి యున్నది; విద్యుచ్ఛక్తులు విస్తరింప వలసి యున్నది; గాలిలో ప్రయాణము జయప్రదము చేయవలసి యున్నది. ఇట్టి ఆధునిక నాగరికతకు చెందిన అభివృద్ధి నంతయు చేసిన యెడల మన యువకులలో చాలమందికి ఉద్యోగములు సమకూడ గలవు. అదియుగాక 'శాస్త్రము' చదువుకొనిన వారిలో యువకులు చాలమంది స్వయంకృషి వలన వారి శాస్త్రజ్ఞానమును బట్టి పరిశ్రమకు తగ్గ సాధనసామాగ్రిని కొంతవరకు తయారుచేసి సంఘమునకు ఉపకారము చేయవచ్చును కాని యిక్కడను మన విద్యావిధానమే నిష్ఫలముగా నున్నది. మన విశ్వవిద్యాలయములలో యే శాఖలోనైనను మన పరిసరములతో సంబంధములేక, ప్రాపంచిక జ్ఞానము నీయక, కేవలము ఆధ్యాత్మికముగాను, ఆదర్శప్రాయముగాను, ఉండుటయే దీనికి కారణము. కాని సర్ ఎం.విశ్వేశ్వరయ్యగారు సూచించిన పథములలో మనదేశమున పరిశ్రమలు వృద్ధిచేసినగాని ఈదేశమునకు ఆర్థికముగా ముక్తి లేదు. ఈసందర్భమున [illegible] నానాజాతి సమితికి (League of Nations) సం[illegible] సర్ ఆర్థర్ సాల్టరుగారిని ఇండియా గవర్నమెంటువారు 1931 సం[illegible] అడిగిరి. సాల్టరుగారు ఈ దేశములలో పరిశ్రమలు తప్పక అభివృద్ధి చేయవలెననియు అందుకు

గాను కేంద్రమునను,అన్ని పరగణాల యందును ఆర్థిక సలహా సంఘము లను (Economic Advisory Councils) నిర్మింపవలెననియు చెప్పి యున్నారు. అయినను నేటికిని వీని నిర్మాణము సంపూర్ణము కాలేదు. ఈ పరిశ్రమాభివృద్ధియందు మన చెన్నరాజధానియే ముందంజ వేయుట మనము సంతోషించవలసిన విషయము. కాలికట్‌లో కేరళ సబ్బు పరిశ్రమను స్థాపించి సర్ ఆల్ఫ్రెడ్ ఛాటరన్‌గారును, సర్ ఫ్రెడరిక్ నికొల్సన్‌గారును ఈ దక్షిణదేశ ప్రజల కృతజ్ఞతకు పాత్రులయినారు.

(2) పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధియే గాక గ్రామ పునరుద్ధరణయు (Rural Re-construction) కొంతవఱకు ఈ నిరుద్యోగ సమస్యను తీర్చును. విశ్వ విద్యాలయముల లోనే సేవకా సంఘముల నెలకొల్పి యువకులకు గ్రామపరిస్థితులను చెప్పి, గ్రామ పునరుద్ధరణ యందు ఉత్సాహము కల్పించుట ఆవశ్యకము. అదియుగాక, ఉద్యోగములు లేక నిరుత్సాహులై యువకులెందరో సహజ మేధాశక్తులగోల్పోవుచున్నారు. ఇది దేశసౌభాగ్యమున కెంత ఉపద్రవమో తెలిసికొనవలసియున్నది. ఈ నష్టము నిర్వ్యాపారము వలన కలుగుచున్నదగుటచే యువకులు కొందఱు కొందఱు చేరి గ్రామములలోని జనులకు విద్య గరపుటకు ప్రయత్నించిన యెడల బాగుండును. కాని యిప్పటి ఉన్నత విద్యనభ్యసించిన యువకులు అట్టి పదవిని నీచమని తలపక అల్ప సంతుష్టులై దేశసేవక భావముతో పని చేయుట మాత్రము ముఖ్యము. పట్టభద్రులు ఒకప్పుడు గ్రామములో ఉపాధ్యాయ పదవి హేయమని అనుకొనినను, నిరుద్యోగ సమస్య యెక్కువ కఠినమగుచున్న కొలదిని వారన్నిటికిని సిద్ధపడుచున్నారు. కనుక గ్రామములలో ప్రాథమిక పాఠశాలలలో 'ట్రయినింగ్' అయిన యువకులనే వేయవలెనను నిబంధనము నేటితో స్థానిక సంస్థలు, ప్రభుత్వము కూడ తీసివేసిన యెడల యెంతయో బాగుండునని తోచును. ఎందఱో పట్టభద్రులు ఆ స్వల్ప జీతములకు ఇష్టపడి వచ్చెదరని నిస్సం

దేశాముగా చెప్పవచ్చును. అదియుగాక బొంబాయి రాజధానిలో వలె మన రాజధానియందును స్థానికసంస్థలకు విద్యా విషయమైన వ్యయమునకు హక్కు లేకుండినయెడల మన యువకులు స్వయం కృషియు ఉత్సాహము కలిగి గ్రామపునరుద్ధరణకును, విద్యావ్యాప్తి కిని పాటుపడెదరని నమ్మవలసియున్నది. మనయువకులు జిల్లా విద్యా శాఖాధికారులతో కలసి వారి సలహాలను తీసికొనియే ఉద్యమమును కొనసాగించుకొన వచ్చును.

గ్రామ పునరుద్ధరణము, విద్యావ్యాప్తి మాత్రమేగాక ఆర్థికస్థితియు బాగుచేయుటకు 'బెంగాలు'లోవలె మనరాజధాని యందును ప్రయత్నములు జరుగవలెను. ఆ రాజధానిలో కొన్నికొన్ని స్థలములలో యువకులకు గ్రామ పరిశ్రములను గురించియు, గ్రామస్థుల అవసర ములను గురించియు బోధించి తగిన శిక్షనిచ్చుటకు ఏర్పాటులు గలవు. అట్లే మనరాజధానియందును అట్టి శిక్షాప్రదేశముల ఏర్పాటు చేయవలయును.

(౩) ఉన్నతవిద్యను అర్హులగు విద్యార్థులకే లభ్యమగునట్లు చేసి వృత్తిమూలమగు శిక్షాలయముల (Vocational and Practical Training Institntions) స్థాపించుటవలనను నిరుద్యోగ సమస్య కొంతవఱకు మున్ముందు తగ్గవచ్చును. మరియు, సరియైన పరిశ్రమా భివృద్ధిలేక విద్యావంతులగుట యువకులకు తగుమాత్రము 'ఉద్యో గముల నీయలేని దేశమున విశ్వవిద్యాలయము లైనను బుద్ధివహించి కొన్ని సంవత్సరముల వఱకును ఉన్నతవిద్యలో 'ఆనర్సు' మాత్రమే యుంచి సామాన్య బి.యె, పరీక్షలను తీసివేసిన చాలా బాగుండునని తోచుచున్నది. ఇది విపరీతమగు సలహాయని కొందఱనినను అన వచ్చును. కాని సామాన్య బి.యె పరీక్షలున్నంత కాలము మధ్యమ పరీక్ష ప్యాసులయిన యువకులందఱకు ఒకతాత్కాలిక ఆదర్శమును కనపరచుచున్నవి. ఈ ఆదర్శమును ఎప్పటియట్లు ఉండనిచ్చి యువకు లను వృత్తి సంబంధమైన విద్య నభ్యసించుడనిన వారు చెవినొగ్గరు.

కనుక 'ఆ ఆదర్శమునే వారి దృష్టిపథమునుండి తొలగించిన యెడల వారు తప్పని సరిగా నైనను ఉపయోగకరములైన పథములను బట్టె దరని నమ్మవలసియున్నది. ఉన్నతవిద్య నభ్యసించు కుతూహలముతో నున్న యెందఱో యువకులనో యిట్లు హతాశులను చేయుట కేవలము అధర్మమనెడు వారు పెక్కురుగలరు. కాని ఎందఱో యువకులకు ధన నష్టము కల్గించి, ఆశ నెలకొల్పి, తుదకు నిరుత్సాహులుగాను, నిరుప యోగులుగాను చేసి దేశసేవ కనర్హులుగా తయారుచేసిన పాపము కంటె పైచెప్పినదియే మంచిదిగదా!

(4) విశ్వవిద్యాలయములలో ఉద్యోగ విషయమైన సలహాసంఘము లను (Unversity Employment Bureaus) స్థాపించిన యెడల నది యు కొంతవరకు ఈ నిరుద్యోగ సమస్యను తగ్గించ వచ్చును. ఏలయన మన యువకులలో ఎందఱకో మనదేశములో నున్న ఉద్యోగావకా శము లేవియో, వేర్వేర వారికి కావలసిన శక్తిసామర్థ్యము లెట్టివి యో తెలియనే తెలియవు. వారివారి శక్తిసామర్థ్యములును, వారిఆశ యములును కూడ మనపట్టభద్రులలో నయితము చాలమందికి తెలి యవనిన అతిశయోక్తి కాదు. 'ఈ ఉద్యోగమునకు నేను అర్హుడను, కాను' అని చెప్పకలిగెడు సామర్థ్యముకూడ మన యువకులలో చాల మందికి లేదనియే చెప్పవచ్చును. వారు పట్టభద్రులగుటకు మున్నే వారి యాస్తి అడుగంటుటయు, ఆత్మ పోషణమే గాక దార పుత్రా దుల పోషించుభారము తలపై బడుటయు, కనుక వారు అనాలోచి తముగా ఎట్టి ఉద్యోగమున కైనను సిద్ధపడుటయు మనము చూచుచు న్నాము. ఈ విధానము వారికి, సంఘమునకు, దేశమునకు ఎంత నష్ట మో వేరే చెప్పనక్కరలేదు. ఈనష్టమును కొంతవఱకు తగ్గించుటకే విశ్వవిద్యాలయ ఉద్యోగసలహా సంఘములు ప్రయత్నించును. ఇట్టి సంఘము నొకదానిని మన దక్షిణదేశమున ఆంధ్ర విశ్వవిద్యాలయ ము స్థాపించి యున్నందుకు మనము సంతోషింప వలసియున్నది. కాని ఈసంఘము లన్నియు వాని ఉద్దేశములలో ఎంతవఱకు సాధింప

గలిగినవి అను విషయము నునకు తెలియుటలేదు.

(5) దేశములో కొన్ని స్థలములు ఉచ్ఛస్థితియందును, కొన్ని నీచస్థితి యందును, ఉండుటచేత ఆయాప్రదేశములలో వ్యాపారావకాశము లను బట్టి మన యువకులు సర్దుకొనినయెడల నిరుద్యోగ సమస్య కొంతవఱకు తగ్గునని కొందఱు అభిప్రాయ పడుచున్నారు. అట్లు చే యుట చేత నిరుద్యోగ సమస్యను దేశములో నలుమూలలకు సమా నముగా విస్తరింప జేయుటేగాని అంతగా లాభము కాన్పించదు. మన దేశముయొక్క ఆర్థికస్థితి నలుగడల యిప్పటికంటె బాగుపడినగాని ఈ నిరుద్యోగ సమస్య అంత సులభముగా పోవునదిగాదు.

(6) ఉన్నతోద్యోగము లన్నిటి యందును ఎక్కువగా స్వదేశీయు లనే నియమించిన యెడల ఈ నిరుద్యోగ సమస్య కొంతవఱకు తీరుననుటకు సందియములేదు. నిస్స్వతంత్రమైన ఈ నిర్భాగ్యదేశము పరిపాలకవర్గములోని నిరుద్యోగసమస్యను తొలగించుటకు ఉపకర ణముగా నున్నది గాని అసంఖ్యాకులై మేధావులగు స్వదేశీయ యువకుల నిర్వ్యాపారసమస్య తొలగింపలేకున్నది. సైన్యములోను, నౌకాదళములోను, యంత్రాగారములోను, కార్ఖానాలోను, చిన్న- పెద్ద ఉద్యోగములందు క్రమముగా స్వదేశీయులను నియమించిన గాని ఈ నిరుద్యోగసమస్య యింతటితో పోవునదికాదు.

(7) మన రాజధానిలో మాత్రము నిరుద్యోగ కమిటీవారు చెప్పిన ప్రకారము మన యువకులలో చాలమంది వ్యవసాయమునకు మరలి న ఈ సమస్య కొంతవఱకుతీరును. కాని విద్యావంతులై ఉన్నతో ద్యోగములు వాంఛించిన యువకులు హాలికులగుటయా అన్న సందే హము పోవలెను. పరతంత్రులై దాస్యమున వేతనములు పొందుట కంటె హాలికులై స్వతంత్రులగుట మంచిదికదా యని బమ్మెర పోత నామాత్యుడు సత్కవులనుగురించి చెప్పిన మాటలను స్మరించు కొ నుచు, విద్యావంతులగుయువకులు వ్యవసాయమునకు దృష్టి మరల్చిన

ఈ నిరుద్యోగ సమస్య మన రాజధానిలో పటాపంచలగుటకు సందియము లేదు. కాని పాశ్చాత్యులు పారిశ్రామికముగా వృద్ధిపొందు చుండ మనము రెండవవైపునకు పోవుటయా యను కించ పోడమున మానదు. అయినను స్వాతంత్ర్యాభిమానులగు మన యువకులకు స్వేచ్ఛా జీవన మబ్బునుగదా! కనుక విద్యాశాఖలలో వ్యవసాయము నకుపయోగపడు విద్య నుపదేశించిన యెడల విశ్వవిద్యాలయములు యువకులకు ఉపకారము చేసినవి యగును.

(8) ఇప్పుడు ఉండిన ఉద్యోగములకైనను కుల గోత్రాదులను బట్టి గాక పోటీ పరీక్షలు (Coparative Examination) పెట్టి యువకులను తీసికొనిన యెడల నిరుద్యోగ సమస్యతో బాటు అన్యాయమును కలిసియుండజాలదు. అట్లు జరిగిన ప్రస్తుతము శిఫారసులకొఱకు విని యోగ మగుచున్న యువకుల శక్తిసామర్థ్యములు, బుద్ధి విశేషములు దేశసేవ కుపయోగపడును. అదియుగాక పోటీ పరీక్షలలో గెలువని వారు ఆ యుద్యోగము లందే బుద్ధి వ్యయముచేయక జీవనోపాధికి యితర మార్గములకొఱకు వెదుకగలరు. యువకులు అనవసరముగా ఆశాపీడితులగుటయైనను కొంతవఱకుతగ్గును.

(9) ఈ నిరుద్యోగ సమస్యకు మీ ఉపాయ మేమియని యువకులనే అడిగిన యెడల ఉద్యోగ శాఖల అన్నిటియందును వయోవృద్ధులను తక్షణము తొలగించి వానియందు తమను నియోగింప మనెదరు. ప్రస్తుతము ప్రభుత్వోద్యోగమునుండి విరమించుటకు వయస్సు 55 సంవత్సరములు. ఈ హద్దు పూర్వము దేశములో జనులు దేహదార్ఢ్యము కలవారై దీర్ఘజీవులైన నాడు బాగుగనే ఉన్నది. కాని దేశమున జనులందఱు ఇప్పుడు జవసత్త్వము లుడిగి అల్ప జీవులై యున్నారు. కనుక ఈ హద్దును గవర్నమెంటువారే 50సంవత్సరములకు దించుటకు తలపెట్టుచున్నారు. కాని ఈ వయస్సును 45 సంవత్సరములకు తగ్గించినను అన్యాయము కాదని తోచుచు. ఏలయన మన దేశము అనాదినుండియు మిక్కుటమగు ధనాశలేక, ఆధ్యాత్మి

కమగు ఆదర్శముకలది. ఈ దేశప్రజలు స్వల్పముతోడనే జీవనము ను గడపుటకు అలవాటు పడినవారు. అదియుగాక జీవితముయొక్క పరమావధి అనంతమగు ధనార్జనమని ఎవ్వరనగలరు? మరియు ప్రస్తుతము దేహదార్ఢ్యము కలిగి ఉద్యోగకాంక్ష గల కొందఱకు 60 సంవత్సరములు వచ్చువఱకును ఉద్యోగములో నుండుటకు ప్రభుత్వము అనుమతి యిచ్చుచున్నారు. జీవనము గడుపుటకు ముఖ్యావసరముల కేనియు ధనార్జనములేని విద్యావంతులగు యువకులెందఱో నిర్వ్యాపారులై క్షోభించుచుండ కేవలము స్వార్థపరులగు కొందఱకు ఉద్యోగవృద్ధి అసమంజసము కదా!

మరియు ప్రస్తుతము ఉద్యోగ శాఖలయందు 55 సంవత్సరములు నిండని మనుష్యులకు 35 సం॥లు ఉద్యోగకాలము (Service) ఉన్న యెడల వారు ఉద్యోగమునుండి విరమించుటకు వీలుగలదు. 20 సంవత్సరములు ఉద్యోగము చేసిన వారికిని ఈవీలునిచ్చిన యెడల దాస్యబంధమున విరక్తి చెంది అయిష్టముగా ఉద్యోగములోనున్న కొందఱు సంతోషముతో యువకులకు తావిచ్చెదరు. ఎట్లయినను మనదేశమున ఉద్యోగ పరిస్థితులు పూర్తిగా తారుమారు అగువఱకును సంతృప్తి యుండదు. దేశమున విద్యావంతులలో నిరుద్యోగ సమస్య యెంతో విషాదకరమై కొందఱు యువకులు జీవనము దుర్భరమని ఆత్మహత్య చేసికొనుచుండుట యెంత శోచనీయము!

(10) ఈ నిరుద్యోగ సమస్య కొంతవఱకు హిందూదేశము అధిక సంఖ్యాక మగుటజేసి (Over - Populater) యెక్కువ దారుణమగుచున్నది. కనుక మన దేశమున ఐచ్ఛికమగు సంతాన నిరోధ మార్గములను విస్తరింపజేసి జన సంకోచము కొఱకు ప్రయత్నించిన నీ సమస్య యంత దుఃఖభాజనముకాదు. ప్రస్తుతము ఉద్యోగస్తులై ధనార్జనము చేయుచున్నను పెద్ద కుటుంబములు కలవారు క్రమముగా సుఖములను, ముఖ్యావసరములను గోల్పోయి తుదకు కడు దరిద్రులై చనిపోవుచుండుట మనము చూచు చున్నాము.

ఇంక యిప్పటి నిరుద్యోగులైన యువకుల మాట చెప్పుట కేమియు న్నది. కనుక సంతాననిరోధము మనదేశమునకు ప్రస్తుతము ఆవశ్యకమని చెప్పక తీరదు.

(11) ఈ పై నుదహరించిన కారణము లన్నిటికంటె ప్రస్తుతము నిరుద్యోగసమస్య తీరవలెనన్న మన దేశములో అనాదినుండియు ఉన్న ఆధ్యాత్మిక దృష్టిని మరల్చి ప్రస్తుత నాగరికతా విశేషము లన్నిటిని తెలిసికొని ప్రతిమానవుడును ఈ లోకమున ఈ జన్మముననే సౌఖ్యము పొందుటకును హక్కు కలిగి యున్నాడని గ్రహించుట చాల ముఖ్యముగా నున్నది. ఒకప్పుడు మనదేశము అన్ని దేశముల కంటెను అత్యధిక వైభవముతో, నాగరికతతో ఉండిన ఉండుగాక, ప్రస్తుతము మన కథము కాలప్రవాహములో కొట్టుకొనిపోయినది. మనమింక వెనుకకు పోజాలము. ముందునకు పోవుటయే కడుసులభ మనిపించును. కనుక మనదృష్టిలో ఈమార్పుమాత్రము రాకతప్పదు ఈ వ్యాసము ముగించుటకు పూర్వము ఈ నిరుద్యోగ సమస్యను తీర్చుటకై మనప్రభుత్వ మెంతవఱకు ఎట్టి ప్రయత్నములు చేసియు న్నారను విషయము కొలదిగా ముచ్చటింప వలసియున్నది. ఈ నిరుద్యోగ సమస్య ఈ దేశమునకు క్రొత్తకాదని యిదివరకే చెప్పియు న్నాను. ఇంగ్లండు దేశములో ఈ నిరుద్యోగ సమస్యను సాధించుటకు షుమారు 2000 విధానము లున్నవి. వానికి షుమారు 250000 పౌన్లు ధనము చందాకూడినది. దీనినిబట్టి చూడ మనదేశములో యేమియు ప్రయత్నములు చేయబడు చున్నట్లే కనబడవు. పైగా ఒకప్పుడు మద్రాసు శాసన సభలో ఎవరో నిరుద్యోగ సమస్య దారుణముగా నున్నదని చెప్పగా ప్రభుత్వము వారు వారికి చాలా వందనము లని ఊరకుండిరి. ప్రభుత్వము వారికి ఈ నిరుద్యోగ సమస్యను తొలగించుటకు యిష్టమున్నది కాని వారికి సర్వదా ధనలోపము కనబడునట. దీనియందలి సత్యా సత్యములు మనదేశ ప్రభుత్వముతో ఎక్కువ సంబంధము లేని మనకెట్లు తెలియును?

ఏది యెట్లున్నను ఈ నిరుద్యోగ సమస్యకు ఏదైన నొక పరమసాధనము లేదని మనకు తెలియుచున్నది. నిర్వ్యాపారులైన యువకులు, సంఘము, విశ్వవిద్యాలయము, ప్రభుత్వము, అందఱును కూడకలసి తొలగింప ప్రయత్నింప వలసిన దారుణ సమస్య అయి యున్నది. నిరుద్యోగులైన యువకుల సంఘము లచ్చటచ్చట స్థాపింప బడ్డవి. కుంభకోణములోనున్న అట్టి సంఘమొకటి నిశ్చయము తోడనే పని చేయుచున్నది. కాని ఈ సంఘములు ఎవ్వరిని దూషించుటకు పని లేదు. సాధ్యమైనంత వఱకు శాంతము వహించి ప్రజలకును, ప్రభుత్వమునకును గూడ ఈ నిరుద్యోగ సమస్యను తొలగించుటకు మార్గములను, సలహాలను యిచ్చుచుండవలెను. మొత్తముమీద ఈ సమస్యను సాధ్యమైనంత త్వరలో తొలగించుట సంఘములకును, ప్రభుత్వమునకును విధి; దేశక్షేమకారకము. ఉన్నతవిద్య నభ్యసించిన యువకులు హతాశులై, నిరుత్సాహులై, జీవితమును ప్రపంచమును అసహ్యించు కొనుచు ఆత్మహత్యలను గావించు కొనుటయు, గుమిగాకూడి వీధుల వెంబడి (బొంబాయిలో వలె) 'అన్నమోరామచంద్రా' యని తిరుగుటయు హృదయ విదారకములు కావా?

వ్యాసాంతమున యువకుల కోమాట: అధైర్యము విద్యావంతులయు, ఉత్తమ పురుషులయు లక్షణము కాదు. దయార్ద్రహృదయు లెవ్వరో సహాయముచేసి ఉన్నతస్థితిని చేకూర్చెదరను నమ్మకమును అప్రస్తుతము. అనేకవర్షములు విద్యాభ్యాసమునకై గడపిన జీవితము నిష్ఫలము కాజాలదు. వ్యక్తికి జీవితములో ఔన్నత్యము తనమీదనే ఆధారపడి యుండును. ఉన్నతాదర్శము, దృష్టిపథము, ఉన్నయెడల ప్రతివ్యక్తియు జయము పొందితీరును. ఇవి సులభసాధ్యము లెన్నటికిని కావు. ఎడతెగని ప్రయత్నము చేతనే సాధింప నగును. పూర్వము దూరదేశములతో వర్తకము సాగించి, వలస రాజ్యముల నేర్పరచుకొని, సారస్వత వైజ్ఞానికాది శాఖలలో నాయకత్వము వహించిన దక్షిణదేశమునకు ఈ నిరుద్యోగ సమస్యను తొలగించుట దుష్కర

సాధ్యము కాజాలదను ఆశయు, ధైర్యమును కలిగి ఉత్సాహముతో పనిచేసిన యెడల మన యువకులు స్వదేశీయులగు యువకు లందఱకును మార్గదర్శకు లయ్యెదరు.

# ఆహుతి

'నళిని'

విరిసిన తీపులు
విరిగి విషాలై,
పెట్టని ముద్దులు
విషోరగాలై,

విసపు విసుర్లలో
విసరు బుసులతో
అఱిచాయి;
కఱిచాయి;

ఉడుకు నెత్తుటిని
ఉద్రేకించే
కాఁగిలికై తెగ
సాగిన నరాలు

పటపట నొక్క మొగి
పటుక్కుమని తెగి
పోయాయి,
పోయాయి,

కొఱికే కోరిక
ఉఱికే మనస్సు
ఊపే కామం,
ఉబికే వయస్సు;

మఱుగు ప్రణయమే
మహా ప్రళయమని
పించింది;
ముంచింది,

ఒంటరి బ్రతుకూ
తుంటరి కాయం;
తీరని వాంఛ;
ఆరని మాట;

ఎగసిన జీవం;
ఎముకల గూడు
చిచ్చున మాడాయి;
చిటపట లాడాయి;

# తెరచాటు కళ

మద్దాలి సూర్యప్రకాశరావు

## ౨వ ప్రకరణము

పోలిగ్నోటస్ కాలంనుంచి యవనకళ ఉరకలతో, పరుగులతో అభివృద్ధి పొందింది. కళాసామగ్రిని, రచనాపద్ధతులను చాలవరకు ఫొనీషియనుల ( Phoenicians ) దగ్గరనుంచి సంపాదించారు యవనులు. కొన్నింటిని వారే కనిపెట్టినారు. క్రీ.పూ. 4వ శతాబ్దములో యవనకళా వాతావరణంలో ఒక వేదన బయలుదేరింది. చిత్రకారులు ఈ క్రొత్త సంభారాలతో శిల్ప వైచిత్ర్యాలు సృష్టించాలని తహతహలాడుతున్నారు. కుతకుతలాడే యీ ముడిసరుకు నురగలలోనుంచి బయలుదేరాడు జోక్సిస్ ( Zenxis )

జోక్సిస్ క్రీ.పూ. ౪౨౦ - ౩౯౦ కాలమునాటి వాడు. హీరాక్లియా ( Heraclea )అనే పట్టణంలో పుట్టాడు, పెరిగాడు. హీరాక్లియా నల్ల సముద్రపు ( Black Sea ) తీరాన్ని వుంది; ఆసియా ఖండాన్ని అంటి వుంది. అది కారణంగా జోక్సిస్‌కు పెరిషియాదేశస్థులతో పరిచయం కలిగింది. వారి శృంగారము, భోగములు పట్టుబడ్డాయి. యవన కళలో అదివరకు ప్రథమస్థాన మివ్వబడిన తీవ్రంగా, బాధగావుండే నిరాడంబరత్వాన్ని ( Severe simplicity ) వదలిపెట్టాడు. వారికి లాక్షిణికమై, శాస్త్రీయమైన సౌందర్యం ( Conventional beauty ) అతనికి రుచించలేదు. సహజమై, ప్రకృతిసిద్ధమై, తనకళ్ళతో చూచి, మెచ్చిన అందాన్నే చిత్రించడం పరమావధిగా యెంచుకున్నాడు జోక్సిస్.

ఇతనికి గురువు యవన శిల్పిదిగ్గజాలలో ఒకడైన ఎపొలోడోరస్ ( Apollodorus ). వీళ్ళిద్దరిని తలుచుకుంటే ద్రోణుడు, అర్జునుడు జ్ఞాపకానికి వస్తారు. ఎపోలోడోరస్ యవన చిత్రకళదర్వాజాని బాహాటంగా తెరిచాడు. లోనికి ఠీవిగా ప్రవేశించాడు. అతని శిష్యుడు, అతనిని మించినవాడు జోక్సిస్.

ఇంతవరకు యనన చిత్రకారు లెవ్వరు తలపెట్టని అద్భుతమైన కళా సేవ జోక్సిస్ పూనుకున్నాడు. చిత్రానికి సాధారణముగా కొలతలు పొడవు (Length) వెడల్పులే? బొమ్మలు వ్రాయడానికి పొడవు వెడల్పులే గల గోడలుగాని, కాగితములు, నారగుడ్డలు (Kanvas) గాని ఆధారము. వీటిమీద మూడవకొలత ఘనము (Depth) చూపడం యెట్లా? ప్రాచీన యవనులు పొడవు వెడల్పుగల రేఖాచిత్రాలు గీయడంతోనే తృప్తిపడ్డారు. కాని జోక్సిస్ సమస్త జీవరాసులుని ప్రకృతిసిద్ధంగా, సహజంగా చిత్రించాలని సంకల్పించాడు, నడుం కట్టాడు.

ప్రకృతి ననుసరించాలంటే ఘనం చిత్రాలలో నిరూపించాలి; వస్తువుల పుష్టి, వర్తులాకారము చూపించాలి. దీనికి వెలుగునీడల పరిశీలన అవసరము. వీటిని అహోరాత్రాలు కృషి చేసచేసి జోక్సిస్ నేర్చాడు. ఇక్కడనుంచీ యవనకళా చరిత్రలో నూతనయుగం ప్రారంభించింది. (Realistic Art) సహజశిల్పము మొలకెత్తింది. ఈ యుగకర్త జోక్సిస్.

మానవ సౌందర్యాన్ని, అందులో స్త్రీసౌందర్యాన్ని తనచిత్రాలలో చిందించాలని అతనికొక తీరని దాహం. తను సృష్టించిన స్త్రీ మూర్తుల కంటె ప్రపంచంలో ఎక్కువ అందముగల స్త్రీ లుండరాదని అతనిదొక జీవితాశ.

ఇతని యుత్తమసృష్టి (Masterpiece) హెలెన్. (Helen) ఈ చిత్రంలో జోక్సిస్ కలలు రూపందాల్చాయి; అతని ప్రావీణ్యత గడ్డకట్టింది. ఈ బొమ్మని క్రోటాన్ (Croten) అనేపట్టణంలో హీరాదేవి (Hera) గుడిలో గీశాడు. హెలెన్ యవనుల రామాయణమైన ఇలియడ్ (Iliad) కు కథానాయిక. ఆబొమ్మను చూచి విమర్శకులు— "ఇలాంటి అలౌకిక, దివ్యసుందర విగ్రహం కోసం యవనులు, ట్రోజనులు మహాసంగ్రామంలో మగ్గిపోయారంటే ఆశ్చర్యమే ముంది?" అనిరి.

ఒకనాడు జోక్సిస్ స్నేహితుడు సాటి చిత్రకారుడు అయిన నైకోమేఖస్ తనతోడి మరొక స్నేహితుణ్ణి తీసుకొని యీబొమ్మ చూడడానికి వచ్చాడు. అట్టే గాని కేసి నిదానించి చూసి ఆ రెండవ పండితుడు తలయూపి నాకుమాత్రం ప్రత్యేకపుగొప్పదనము ఏమీ కనపడలేదన్నాడు. —"అయితే నాకళ్లతో చూడు, అప్పుడు నీకుకనపడుతుంది ఒక దివ్యమూర్తి"—అన్నాడు నైకోమేఖస్.

యవన పురాణములలో నుంచి, యితిహాసములలో నుంచి చాలా బొమ్మలు వ్రాశాడు జోక్సిస్. కాని విచిత్రమైనవి, అసాధారణమైనవి అపరూపమైన వస్తువులనే (Subjects) యెత్తి చిత్రించాలని అతనికి గొప్పసరదా వుండేది. అది కారణంగా దేవతలు, వీరులు మొదలగు వారి నటుంచి, సెంటారులు (Centaurs) ఫానులు, (Fonous) డ్రయ్యాడులు (Drayads) నైయ్యాడులు (Naiyads) (అనగా మనలో గంధర్వులు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు) మొదలగు కవి కల్పిత విశేషములనే ఎక్కువగా బొమ్మలు వ్రాశాడు.

వస్తువులను అతిస్వాభావికంగా, ప్రకృతిలో చూసింది సాక్షాత్తు నడిచి వచ్చి బొమ్మలో కూర్చుంది అన్నట్లు జోక్సిస్ చిత్రించేవాడు. దీనికి కారణం వెలుగు నీడల గురించి అతడు జేసిన ప్రచండ కృషి. తన పూర్వుల మల్లే కాకుండా చిన్నబొమ్మలు వేయడానికి కూడ వీలు చిక్కింది. భావం ప్రకటించడానికి అతనికి మార్గందొరికింది.

చిత్రకారుడు పారేషియస్ (Parashius) జోక్సిస్‌కు సమకాలీకుడు. అతడు కూడా సహజశిల్పాన్నే అలవరుచు కొన్నాడు. అతనికి, యితనికి ఒకనాడు పోటీవచ్చింది. ఎవరిది యెక్కువ నేర్పరితనమో తేలాలి. అహోరాత్రులు యిద్దరు పనిచేశారు. తుదకు తమతమ బొమ్మలు తెచ్చి సభలో పెట్టారు. జోక్సిస్ తన బొమ్మ తెర తొలగించాడు. ఒక ద్రాక్షతీగ నిండుగుత్తులతో నవనవ లాడింది. వెంటనే ప్రక్క నున్న కిటికీలోనించి రెండు పక్షులు వచ్చి ఆ బొమ్మకేసి పొడవ

బోయాయి. అవి నిజంగా పండ్లేఅనుకొని... పారేషియస్ మానంతో శిరస్సు వంచాడు. జోక్సిస్ నెమ్మదిగా వెళ్లి అతని బొమ్మమీది తెర తీయబోయాడు... అది రాలేదు... మరి,...పారెషియస్ ఒక తెరనే బొమ్మగా వ్రాశాడు.

"నేను అమాయకులైన పక్షులను మోసపుచ్చ గలిగాను. నీవో, తోడి చిత్రకారుణ్ణే మోసపుచ్చావు. నీదే జయము" — అని చిరు నవ్వునవ్వాడు జోక్సిస్...అతడు నిగర్వి.

గ్రీసుదేశములో అంతటా గొప్ప చిత్రకళా ప్రదర్శనాలు జరుగుచుం డేవి. వాటిలో, ముఖ్యమైనవాటిలో జోక్సిస్ తనబొమ్మలని ప్రదర్శి స్తూ ఉండేవాడు. ఒకసారి జోక్సిస్ "ఒక పిల్లవాడు ద్రాక్షపండ్ల గుత్తిని పట్టుకొని యున్నట్లు" బొమ్మ వ్రాశాడు. అప్పుడు గూడా ఒకపక్షి ఆద్రాక్షపండ్లు తినడానికివచ్చిందట. అది చూసి విచారము తో జోక్సిస్ ఆబొమ్మ చెడిపోయిం దన్నాడట. "ఇందులో ద్రాక్ష చక్కగానే చిత్రించాను. కాని పిల్లవాణ్ణి గూడా అంతస్వాభావికంగా చిత్రించి యుంటే పిట్టబెదిరి బొమ్మదగ్గరకు రాకపోయేది కదా!" జోక్సిస్ యితరుల కంటే కఠినంగా విమర్శించుకునేవాడు తన్ను తాను.

నాటకంలో కొన్నికొన్ని చోట్ల రక్తిగట్టిందంటాము. ఆ రక్తికి కార ణం ఆయాఘట్టాలలో ఉండేచలనం. (Movement) ఇట్టి నాటకసం బంధమైన చలనముగల బొమ్మకు డ్రామెటిక్ పవరు ఉందని అం టారు విమర్శకులు. జోక్సిస్, హెరాక్లిస్ (Heracles) బాల్యావస్థకు సంబంధించిన బొమ్మనొకటి వ్రాశాడు. హెరాక్లిస్ యవనులకు భీముడు. పసిబిడ్డముగా ఉన్నప్పుడే అతడు రెండు కొండచిలువలిని నలిపి చంపేశాడట. ఇదీ, విషయం. యవనచిత్రకారులలో నెవరూ ఏచిత్రాన్నీ యిలా వ్రాయలేదట, యింతశక్తితో యింతజీవకళతో.

(సశేషము)

# ప్రేమభిక్షువు

నిలువ నీడే లేద? పలుకు తోడే లేద?
అంతమే లేని యీ యబ్జజాండములోన—

చండభైరవముగా మండు నాతపములో
ప్రేమసుధ నడిగికొను బిచ్చగాని కొకింత
నిలువ నీడే లేద? పలుకు తోడే లేద?
అంతమే లేని యీ యబ్జజాండములోన—

ఆశాప్రపూర్ణమా నాత్మతో వగపుతో
దిక్కు దిక్కుల కెగయు దెసమాలు పులుఁగునకు
పట్టుగొమ్మే లేద? పలుకు తోడే లేద?
అంతమే లేని యీ యబ్జజాండము లోన—

కడవెల్ల ముంచెత్తు కటికి చీఁకటి రేయి;
దెన్నుఁ గానక గుండె దిగులువడు నణువునకు
పలుకు తోడే లేద? వెలుఁగు చుక్కే లేద?
అంతమే లేని యీ యబ్జజాండములోన—

అ॥ రంగనాయకులు

**Edited, Printed and Published by P. Madhava Sarma,
at Usha Press, Telaprolu, Kistna**

